Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

నమోభగవతే దక్షిణామూర్తయే

# నేతివాక్యనిజతత్వచింతన.

ఇది

శ్రీమత్పరమహంస శంకరాచార్య విరచిత

త్వంపద విచార అహంకృత ధ్యానయోగ పద్ధతి.

ఇది

ముముక్షు జనోపయుక్తముగా

బ్రహ్మశ్రీ - బ్రహ్మానంద యోగీశ్వర స్వాములవారిచే

ప్రచురింపఁబడినది.

చెన్నపురి:

ఓం

శ్రీ సద్గురు సిద్ధపరిపూర్ణానంద మహర్షి భ్యో నమః.

# నమో భగవతే దక్షిణామూర్తయే.

---

౧. ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణా మూర్తయేనమః॥

౨. గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణాం।
నిధయే సర్వవిద్యానాం దక్షిణా మూర్తయేనమః॥

# ఆత్మపంచకం ప్రారంభః.

---

౧. నాహం దేహో నేంద్రియాణ్యం తరంగం
నాహంకారః ప్రాణవర్గో న బుద్ధిః
దారాపత్య క్షేత్ర విత్తాది దూరః
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహం॥

౨. రజ్జ్వజ్ఞానా త్భాతి రజ్జుర్యథాహిః
స్వాత్మా జ్ఞానా దాత్మనో జీవభావః

ఆప్తోక్త్యాహి భ్రాంతి నాశే సరజ్జు
ర్జీవో నాహం దేశికోక్త్యా శ్శివోహం॥

3. ఆభాతీదం విశ్వమాత్మన్య సత్యం
సత్యజ్ఞానానంద రూపే విమోహాత్
నిద్రామోహాత్ స్వప్నవత్తన్న సత్యం
శుద్ధః పూర్ణో నిత్య ఏకశ్శివోహం॥

౪. మత్తో నాన్య త్కించి దత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తుమాయోపక్లిప్తం

ఆదర్శాంత ర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మా శ్శివోఽహం॥

౫. నాహం జాతోఽన ప్రవృద్ధోఽనసష్టో
దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః
కర్తృత్వాదిః చిన్మయస్యాస్తినాహం
అహంకార స్యైవహ్యాత్మనో మే శ్శివోఽహం॥

౬. నాహం జాతో జన్మమృత్యుః కుతో మే
నాహం ప్రాణః క్షుత్పిపాసేకుతో మే

నాహంచిత్తం శోకమోహాకులో మే॥
నాహంకర్తా బంధమోక్షౌ కుతో మే॥

ఇతి శ్రీమత్ శంకరాచార్యవిరచిత మాత్మపంచకం
సంపూర్ణం.

---

ఓం నమోభగవతే దక్షిణామూర్తయే

# నిర్వాణషట్కం ప్రారంభః.

---

౧. మనోబుద్ధ్యహంకార చిత్తానినాహం
నచశ్రోత్రజిహ్వే నచఘ్రాణనేత్రే
నచవ్యోమభూమి ర్న తేజోనవాయు
శ్చిదానందరూప శ్శివోహం శివోహం॥

౨. నచఃప్రాణసంజ్ఞో నవై పంచవాయు
ర్నవాసప్తధాతు ర్నవాపంచకోశః

నవాక్పాణిపాదం నచోపస్తపాయు
శ్చిదానందరూప శ్శివోహం శివోహం॥

౩. నమేద్వేషరాగా నమేలోభమోహా
మదోనైవ మేనైవ మాత్సర్యభావః
నధర్మోనచార్థో నకామోనమోక్షః
శ్చిదానందరూప శ్శివోహం శివోహం॥

౪. నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం
నమంత్రోనతీర్థం నవేదానయజ్ఞాః
అహంభోజనం నైవభోజ్యం నభోక్తా
శ్చిదానందరూప శ్శివోహం శివోహం॥

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



౫. నమృత్యుర్న శంకా నమేజాతిభేదః
పితా నైవ మే నైవ మాతా చ జన్మ
న బంధుర్న మిత్రం గురుర్నైవ శిష్య
శ్చిదానందరూప శ్శివోఽహం శివోఽహం॥

౬. అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుర్వ్యాప్య సర్వత్ర సర్వేంద్రియాణి
సదా సమత్వం నైవ ముక్తిర్న బంధ
శ్చిదానందరూప శ్శివోఽహం శివోఽహం॥

ఇతి శ్రీమత్ శంకరాచార్యవిరచితం నిర్వాణషట్కం

సంపూర్ణం

ఓం నమో భగవతే దక్షిణామూర్తయే

# బ్రహ్మజ్ఞానావళి ప్రారభ్యతే.

౧. సకృచ్ఛ్రవణ మాత్రేణ బ్రహ్మజ్ఞానం యతో భవేత్ ।
బ్రహ్మజ్ఞానావళీమాలా సర్వేషాం మోక్షసిద్ధయే ॥

౨. అసంగోఽహ మసంగోఽహ మసంగోఽహం పునః పునః ।
సచ్చిదానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః ॥

3. నిత్యశుద్ధ విముక్తోఽహం నిరాకారోఽహ మవ్యయః ।
భూమానంద స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః ॥

౪. నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహ మచ్యుతః।
పరమానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౫. శుద్ధచైతన్య రూపోఽహ మాత్మారామోఽహ మేవచ।
అఖండానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౬. ప్రత్యక్ చైతన్యరూపోఽహం శాంతోఽహం ప్రకృతేః పరః।
శాశ్వతానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౭. తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరఃశివః।
మాయాతీతః పరంజ్యోతి రహమేవాహ మవ్యయః॥

౮. నానారూప వ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః॥
సుఖరూప స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౯. మాయా తత్కార్య దేహాది మమనాస్త్యేవసర్వదా।
స్వప్రకాశైక రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౧౦. గుణత్రయవ్యతీతోఽహం బ్రహ్మాదీనాంచ సాక్ష్యహం।
అనంతానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౧౧. అంతర్యామిస్వరూపోఽహంకూటస్థః సర్వగోఽస్మ్యహం।
పరమాత్మ స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౧౨. నిష్కలోఽహం నిష్క్రియోఽహం సర్వాత్మాద్యస్సనాతనః।
అపరోక్ష స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౧౩. ద్వంద్వాది సాక్షిరూపోఽహ మచలోఽహంసనాతనః।

౧౪. ప్రజ్ఞాన ఘనఏవాహం విజ్ఞాన ఘనఏవచ।
అకర్తాహ మభోక్తాఽహ మహమేవాహ మవ్యయః॥

౧౫. నిరాధార స్వరూపోఽహం సర్వాధా రోఽహమేవచ।
ఆప్తకామ స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః॥

౧౬. తాపత్రయ వినిర్ముక్తో దేహత్రయ విలక్షణః।
అవస్థాత్రయ సాక్ష్యస్మి చాహమేవాహ మవ్యయః॥

౧౭. దృగ్దృశ్యౌ ద్వౌపదార్థా స్తః పరస్పర విలక్షణౌ।
దృగ్బ్రహ్మ దృశ్యంమాయేతి సర్వవేదాంత డిండిమః॥

౧౮. అహంసాక్షీతి యోవిద్యా ద్వివిచ్యైవం పునఃపునః।
సఏవము క్తః సోవిద్వా నితివేదాంత డిండిమః॥

౧౯. ఘటకుడ్యాది కంసర్వం మృత్తికా మాత్రమేవచ।
తద్వత్ బ్రహ్మ జగత్సర్వ మితివేదాంత డిండిమః॥
౨౦. బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః।
అనేన వేద్యం సచ్ఛాస్త్ర మితివేదాంత డిండిమః॥
౨౧. అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః।
జ్యోతిర్జ్యోతిఃస్వయంజ్యోతి రాత్మజ్యోతిఃశివోఽస్మ్యహం॥

ఇతి శ్రీమత్పరమహం స పరివ్రాజకాచార్య శ్రీమత్ శం
కరాచార్య విరచితా బ్రహ్మజ్ఞానావళీ సమాప్తా.

ఓం తత్సత్.


ఓం నమోభగవతే దక్షిణామూర్తయే

# బ్రహ్మైవాహపంచకం ప్రారంభః.

---

౧. నిర్వికారం నిరాకారం నిరంజన మనామయం
ఆద్యంత రహితంపూర్ణం బ్రహ్మైవాహం నసంశయః॥
౨. నిష్కళంకం నిరాభాసం త్రిపరి చ్ఛేదవర్జితం
ఆనంద మజమవ్యక్తం బ్రహ్మైవాహం నసంశయః॥
౩. నిర్విశేషం నిరాకారం నిత్యముక్త మవిక్రియం
ప్రజ్ఞానైక రసంసత్యం బ్రహ్మైవాహం నసంశయః।

౪. శుద్ధంబుద్ధం స్వతస్సిద్ధం పరంప్రత్య గఖండితం
స్వప్రకాశం పరాకాశం బ్రహ్మైవాహం నసంశయః॥

౫. సుసూక్ష్మ మస్తితామాత్రం నిర్వికల్పం మహత్తమం
కేవలం పరమాద్వైతం బ్రహ్మైవాహం నసంశయః॥

ఇతి శ్రీమత్ శంకరాచార్యవిరచిత బ్రహ్మైవాహపంచకం
సంపూర్ణం.

---

అమెరికన్ డైమెండు ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడియె. చెన్నపురి.

శ్రీరస్తు.

# శ్రీమద్రామాయణ నక్షత్ర మాలిక.

(శేషాగము వర్ణ మెట్టు)

ఇది

పంచవటి. వెంకటరామయ్యగారిచే

రచియింపఁబడి

శ్రీమద్వైశ్యకులపాథోధి

పరిపూర్ణ సుధాకరులగు

పొత్తూరు. జయ్యన్న శ్రేష్ఠిగారిచే

ప్రచురింపఁబడియె.

MADRAS.

1916.

శ్రీ

# శ్రీమద్రామాయణ నక్షత్రమాలిక.

(తే వా ర ము.)

ఆరభిరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

శ్రీరఘురా మునిదివ్య
చారిత్రామృతరసము
సారయశో దాయకము
గౌరవసం ధాయకము ॥.

(చ ర ణ ము లు.)

1. ధారుణిమం డలమందుఁ
దనరారు నయోధ్య
సూరకులో ర్వీపతులు
సొంపుగనే లుదురందు శ్రీ ॥

2. ఆనగరం బలువదివే
లబ్దంబుల్ దశరథుఁడు

పూనికఁబా లనచేసి
పుత్రులన ల్వారఁబడసెఁ. శ్రీ

3. దశరథభూ కాంతునకుఁ
దనయుండై రాఘవుఁడు
శశిధరుని విలుద్రుంచి
జానకినిం బెండ్లాడె. శ్రీ

4. జనకునివా క్యముపరిపా
లనసేయం గనురాముం
డనుజునితోఁ జానకితోఁ
జనుదెంచెఁ వనమునకు. శ్రీ

5. కైకేయీ నందనుఁడు
కాకుత్స్థా గ్రణిఁజేరి
సాకేతం బేలుమని
జోకనుబ్రార్థనచేసె. శ్రీ

6. భరతునిప్రా ర్థనమునకుఁ
బద్మాత్ముం డియ్యకొని

భరతునకా నందముగఁ
బాదుకలఁ జానిచ్చె. శ్రీ॥

7. అన్నకుమా ఱుగవాని
నతిభక్తి నెన్నుచును
బన్నగఁబ ట్టముగట్టి
భరతుఁడురా జ్యమునేలె. శ్రీ॥

8. రక్కసియగా శూర్పణఖ
రాముని మో హించఁగను
గ్రక్కునరా మానుజుఁడు
కామినిభం గముచేసె. శ్రీ॥

9. దానవిభం గమురీతిఁ
దానవనా థుండువిని
జానకిపై మోహముతోఁ
గాననము నకువెడలె. శ్రీ॥

10. వాసిగనా రావణుఁడు
వేసమును ధరియించి

భూసుతయొం టరినుండ
మోసముచేఁగొనిపోయె. శ్రీ

11. ఆలలనా మణిరీతి
నంతజటా యువుదెల్పి
కూలఁగనే సంస్కారం
బోలినిరా ముఁడుచేసెఁ. శ్రీ

12. వనరుహాలో చనుఁడపుడు
కనకాంగిఁ గనిపెట్ట
వనమధ్యం బుననేఁగ
హనుమంతుఁ గనెనంత. శ్రీ

13. చనిసుగ్రీ వునిసఖ్యం
బునవాలిఁ దునుమాడఁ
దనయాజ్ఞఁ హనుమంతుం
డునుశీతఁ గనెలంకఁ. శ్రీ

14. అంతటమా రుతిలంక
నగ్నికినా హుతిచేసి

కాంతనువీ డ్కొనిరాజ
కాంతునిస న్నిధిఁజేరె. శ్రీ॥

15. అంచితవం దనములుగా
విఁచుచుభూ కాంతునకుఁ
గాంచితిబిం బోష్ఠినిలం
కాపురమం దనిప ల్కె. శ్రీ॥

16. వారిజనే త్రనుగనిన
వ ర్తనమం తయుఁదెలిసి
వారిధిపై భూవరుఁడు
వం తెనను గట్టించె. శ్రీ॥

17. వానరసేనాయుతుఁడై
భానుకులేశుఁడురాఁగా
దానవులం బురికొల్పె
దనుజేంద్రుం డనిసేయ. శ్రీ॥

18. కనలుచునం తటకుంభ
కర్ణుఁడుదాఁ జనుదెంచి

మనుజేశు పైఁబడఁగాఁ
దానివెనురా ముఁడువాని. శ్రీ 2

19. అస్త్రగణం బుననింద్ర
జిత్తుమహా క్రోధముతో
హత్తుకొని పోరఁగరా
మానుజుఁడు పరిమార్చెఁ. శ్రీ 2

20. తక్కినరా క్షసవీరుల్
గ్రక్కుననా యుద్ధమునఁ
జిక్కికొని దిగులొంది
శీఘ్రములో హతులైరి. శ్రీ 2

21. సారసనే త్రుఁడువింటఁ
సాయకముల్ సంధించి
ఘోరరణ రంగమునఁ
హాల్చెనునా దశముఖుని. శ్రీ 2

22. సురవరులా రాముని పై

పరగఁగగం ధర్వ్యలును
  బాడిరిపెం పలరఁగను. శ్రీ॥
23. ధరణీసం దనయగ్నిఁ
  దాను బ్ర వేశింపఁగను
సరగునవై శ్వానరుఁడు
  చల్లనివాఁ డై మెలఁగె. శ్రీ॥
24. అమరులునా దశరథుఁడు
  నాకసమం దునఁబొగడఁ
గమలాక్షిం గై కొనియెన్
  గరుణనుసీ తావిభుఁడు. శ్రీ॥
25. మోదముతో దాశరథి
  పుష్పకవై మానికుఁడై
వై దేహీ సహితుండై
  వచ్చెనయో ధ్యకుఁదాను. శ్రీ॥
26. ఇంపుగవేం కటరాముం
  డెంతయుధ్యా నింపఁగను

పెంపుగరా ముఁడురత్న
పీఠమునక్ గొలువమరె. శ్రీ॥

27. వెలయఁగ శ్రీ రామునకర్థ
విన్నఁబతిం చినఁగాని
మెలమినిగాం తురుభక్తు
లిహపరసౌ ఖ్యంబులును. శ్రీ॥

గద్య. శ్రీమదాశ్వలాయనస గోత్రపవిత్ర
పంచవటీ శేషార్య పుత్ర
వేంకటరామ నామధేయ
విరచితమగు
శ్రీమద్రామాయణ నక్షత్రమాలిక
సంపూర్ణము.
మంగళమ్.

Vadaja & Co. Printers, Madras.

# ప్రకటన.

యీ గ్రంథములేగాక యితర సంస్కృతాంధ్ర గ్రంథములుకూడ దొరుకును.

| గ్రంథము | | వెల |
|---|---|---|
| మలయాళీమంత్రము. | | 1 0 0 |
| మోహినీవిలాసము డ్రామా. | | 0 8 0 |
| శశిరేఖాపరిణయము. | „ | 0 12 0 |
| మకరకరవ | నవల. | 0 6 0 |
| సర్పశాస్త్రము. | | 0 8 0 |
| శివస్తోత్రామృతము. | | 0 3 0 |
| సురాభాండేశ్వరము. | | 0 4 0 |
| సుశీల వైనావతి నవల. | | 0 12 0 |
| శమంతసేన | „ | 0 4 0 |
| లావణ్యమయీ | „ | 0 6 0 |
| రో బాలుమారి | „ | 0 2 0 |
| ఫలప్రదీపిక. (జ్యోతిషము.) | | 1 0 0 |
| కవిచౌడప్పశతకము. | | 0 2 0 |
| భక్తవిజయము 0 12 0 గ్లేసు కాలికో | | 1 4 0 |

W. వీరన్న శ్రేష్ఠి,

చాకలపేట, మదరాసు.

శ్రీః

# అపరోక్షానుభూతి

(ఆంధ్రతాత్పర్యసహితము.)

---

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే
ప్రకటితము.

1920.

## సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| మాఘపురాణము, సాంధ్రతాత్పర్యము ... | 2 | 0 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు. | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు ... | 0 | 1 |
| వ్రతచూడామణి 360 వ్రతములు, మంచిప్రతి ... | 1 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములం జేర్చి యాంధ్ర మహాజనసంప్రదాయానురూపముగం బరిష్కరించి ముద్రించి యున్నాము. మంచిప్రతి ... | 2 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు ... | 0 | 4 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము ... | 2 | 0 |

పరమాత్మనే నమః.

# అపరోక్షానుభూతి

(ఆంధ్ర తాత్పర్యసహితము.)

---

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటింపఁబడినది.

1920

ఓమ్

పరబ్రహ్మణే నమః.

# అపరోక్షానుభూతి.

## (ఆంధ్రతాత్పర్యసహితము.)

---

### మంగళము.

అవతారిక. గ్రంథకర్తయైన శ్రీమచ్ఛంకరాచార్యులవారు గ్రంథనిర్విఘ్నపరిసమాప్తికొఱకు ఇష్టదేవతానుసంధాన లక్షణమైన మంగళము నాచరించుచున్నారు.

శ్లో. శ్రీహరిం పరమానన్ద ముపదేష్టార మీశ్వరం,
వ్యాపకం సర్వలోకానాం కారణం తం నమామ్యహమ్. ౧

తా. జడాజడ మైనసమస్తప్రపంచమునకు కారణుండు, సర్వవ్యాపకుండైన ఈశ్వరుఁడు. అట్టి ఉపదేశించువాఁడును, పరమానందస్వరూపుఁడు నగు శ్రీహరిని నేను నమస్కరించుచున్నాను.

విశేషార్థము. హరియే ఉపదేశించువాఁ డనుటవలన, అతఁడే గురుస్వరూపుఁ డని గ్రహింపవలయును.

అవ. గ్రంథకర్తతాఁజేయఁబూనినదానిని ప్రతిజ్ఞ చేయుచున్నారు.

అపరోక్షానుభూతి రై ప్రోచ్యతే మోక్షసిద్ధయే,

సద్భిరేవ ప్రియత్నేన వీక్షణీయా ముహుర్ముహుః. ౨

తా. ముముక్షువులైనజ్ఞానులు ప్రయత్నముచే పలుమాఱు విచారింపఁదగినట్టిదియును, ఇచ్చటఁ జెప్పఁబడిన లక్షణములతోఁ గూడినదియు నగు అపరోక్షానుభూతి యను గ్రంథమును మోక్షసిద్ధినిమిత్తము చెప్పుచున్నాఁడను.

వి. తత్త్వమస్యాది మహావాక్యశ్రవణముచేఁ గలుగు బ్రహ్మమును విషయముఁజేయు విద్యయగుటచే దీనికి అపరోక్షానుభూతి యని పేరిడఁబడెను. ఉత్తమాధికారులకు గ్రంథావలోకనమాత్రముచేతనే యిష్టసిద్ధి యగుటంబట్టి దీని కీపే రుంచఁబడినది.

అవ. మోక్షసాధనమైన వైరాగ్యచతుష్టయమును బొందునట్టి యుపాయమును జెప్పుచున్నారు.

స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్,
సాధనం ప్రభవే త్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్. 3

తా. తనయొక్క వర్ణాశ్రమధర్మము (బ్రహ్మార్పణముగాఁ జేయఁబడిన కర్మానుష్ఠానమువలనఁ గలిగినపుణ్యము) చేతను, తపస్సు (కృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రాయశ్చిత్తము) చేతను, భగవంతుని సంతోషింపఁ జేయుటచేతను వైరాగ్యము మొదలగు నాల్గుసాధనములును పురుషులకుఁ గలుగుచున్నవి.

వి. సాధనచతుష్టయ మనఁగా:—1 వివేకము, 2 వైరాగ్యము, 3 శమాదిషట్కసంపత్తి, 4 ముముక్షుత్వము సాధన చతుష్టయమనఁబడు వివే

కాదిక్రమముగా నొకదానికొకటి కారణముగా నుండినప్పటికిని, వైరా
గ్యము అసాధారణకారణమై యున్నదని నిరూపించుటకొఱకు ఆవైరా
గ్యము మొదట చెప్పఁబడినది.

అవ. వైరాగ్యలక్షణమును జెప్పుచున్నారు.

బ్రహ్మాదిస్థావరాన్తేషు వైరాగ్యం విషయేష్వను,
యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్. ౮

తా. బ్రహ్మాది స్థావరాంతమువఱకుఁ గల విషయములయందు, కాకి
మలమునం దిచ్ఛలేకుండునట్లు ఇచ్ఛ లేకుండుటయే నిర్మలమైన వైరాగ్య
మగును.

వి. కాకవిష్ఠము ఔషధమునకైనను పనికిరాదని నిగ్రహింపఁబడినది
ఇది పమనాన్నము మొదలగువానికి ఉపలక్షణము.

అవ. వైరాగ్యమునకుఁ గారణమైన వివేక లక్షణమును చెప్పుచున్నారు.

నిత్య మాత్మస్వరూపం హి దృశ్యం త ద్విపరీతగమ్,
ఏవం యో నిశ్చయః సమ్య గ్వివేకో వస్తునః స వై. ౫

తా. ఆత్మస్వరూపము (ద్రష్ట) నిత్యము; దృశ్యము (అనాత్మస్వరూపము) దానికి విపరీతమైనది అనిత్యము; అనెడి నిశ్చయదార్ఢ్యమేదియో, అదియే వస్తువివేక మగును.

వి. ఇచ్చట అనుమానము ప్రమాణము—ద్రష్ట నిత్యము, ద్రష్ట కానిది అనిత్యము. దృశ్యము అనిత్యము. దృశ్యముకానిది. నిత్యము.

అవ. వైరాగ్యకార్యములైన శమదమలక్షణములను జెప్పుచున్నారు.

సదైవ వాసనాత్యాగః శమోఽయ మితి శబ్దితః,
నిగ్రహో బాహ్యవృత్తీనాం దమ ఇత్యభిధీయతే. ౬

తా. ఎల్లప్పుడును వాసనలను నిగ్రహించి యుండుట శమ మని చెప్పఁబడును. బాహ్యవృత్తులను నిగ్రహించియుండుట దమ మనఁబడును.

వి. వాసన యనఁగా శాస్త్రవాసన మొదలగునవి. అయినను మలిన వాసనలను మొదట నిగ్రహించి, తర్వాత సకల వాసనలను నిగ్రహింప వలయును.

అవ. ఉపరతి తితిక్షలలక్షణములను జెప్పుచున్నారు.

విషయేభ్యః పరావృత్తిః పరమోపరతి ర్హి సా,
సహనం సర్వదుఃఖానాం తితిక్షా సా శుభా మతా. ౭

తా. ప్రసిద్ధమైనశబ్దాదివిషయములనుండి నిస్పృహయగుటయేదియో, అదియే పరమోపరతి యనఁబడును. సకల దుఃఖములను సహించుట యేదియో, అదియే శుభమైన తితిక్ష యని తెలంపఁబడుచున్నది.

వి. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునివి విషయములు.

అవ. శ్రద్ధా సమాధానముల లక్షణములను నుడువుచున్నారు.

నిగమాచార్యవాక్యేషు భక్తిః శ్రద్ధేతి విశ్రుతా,
చిత్తైకాగ్ర్యంతు సల్లక్ష్యే సమాధాన మితి స్మృతమ్. ౭

తా. వేదవాక్యములందును, గురువాక్యములందును, గలుగునట్టి

[illegible]
సమాధాన మని తలంపఁబడుచున్నది.

౨. పైన చెప్పఁబడిన 1 శమము, 2 దమము, 3 ఉపరతి, 4 తితిక్ష, 5 శ్రద్ధ, 6 సమాధానము అనునీయాఱును శమాదిషట్క మనఁబడును. ఈ శమాదులు వైరాగ్యకార్యము లని యెఱుఁగునది. సత్తె యనఁగా పరప్రశ్నము.

౨౯. శమాదిషట్కసంపత్తియొక్క కార్యస్వరూప మైన ముముక్షుత్వమును బోధించుచున్నారు.

సంసారబన్ధ నిర్ముక్తిః కథం స్యాన్మే కదా విధే,
ఇతి యా సుదృఢా బుద్ధిః వక్తవ్యా సా ముముక్షుతా. ౯

తా. సంసారబంధనివృత్తి నా కెప్పుడు ఏవిధముగాఁ గల్గునో యనెడి మంచిదృఢబుద్ధి యేదియో, అది ముముక్షుత్వ మని చెప్పఁదగినది.

అవ. వైరాగ్యాది సాధనసంపన్నుఁడు చేయవలసినకృత్య మిట్లొదను చున్నారు.

ఉక్తసాధన యుక్తేన విచారః పురుషేణ హి,
కర్తవ్యో జ్ఞానసిద్ధ్యర్థ మాత్మనః శుభ మిచ్ఛతా. ౧౦

తా. ఇదివఱకు చెప్పఁబడిన సాధనములతోఁ గూడిన ఆత్మసుఖమును గోరుపురుషునిచేత జ్ఞానసిద్ధికొఱకు విచారము చేయఁదగినది.



అవ. ఆవిచారముయొక్క ...

అవ. ఆ విచారముయొక్క ... ఫలత్వమును దృష్టాంతములతోఁ జెప్పుచున్నారు.

నోత్పద్యతే వినా జ్ఞానం విచారేణాన్యసాధనైః,
యథా పదార్థభానం హి ప్రకాశేన వినా క్వచిత్. ౧౧

తా. ప్రకాశములేక ఎచ్చోటను ఏపదార్థమును గోచరించుటలేదు. అట్లే విచారములేక, ఇతరములైన (కర్మాది) సాధనములచేత జ్ఞానము కల్గుటలేదు.

అవ. ఆ విచారలక్షణ మిట్టిదని రెండు శ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

కోహం కథ మిదం జాతం కోవా కర్తాఽస్య విద్యతే,
ఉపాదానం కిమ స్తీహ విచారః సోఽయ మీదృశః. ౧౨

తా. నే నెవ్వఁడను? ఈప్రపంచ మేరీతిగా కలిగెను? దీనికి కర్త యెవ్వఁడు? ఇచ్చట ఉపాదానకారణ మేది? అను నీ లక్షణములతోఁ గూడినది విచార మనఁబడును.

నాహం భూతగణో దేహో నాహం చాక్షగణ స్తథా,
ఏత ద్విలక్షణః కశ్చి ద్విచారః సోఽయ మీదృశః. ౧౩

తా. భూతగణ మైనదేహము నేను కాను; అట్లే ఇంద్రియగణమును నేను కాను; వీనికంటె వేఱైనవాఁడను నే ననెడి లక్షణము కలది విచార మనఁబడును.

వి. పృథివ్యాది నాల్గుభూతములను జేరినది శరీరమని చార్వాకుల

[illegible] ఆత్మ. ఇచట
దేహాత్మ వాదియైనచార్వాకమతమును, అట్లే ఇంద్రియాత్మ వాదియైన లోకా
యితమతమును ఖండింపఁబడినది. నేను, నేను, అనెడి అభిమానమునకు
కారణమైనది ప్రత్యగాత్మ. భూతేంద్రియములకు వేఱైనవాఁ డనఁగా,
స్థూల సూక్ష్మములకంటె భిన్నుఁడనియును, మనస్సునకును వాక్కునకును
అందనివాఁ డనఁగా, జాత్యాదులు లేనివాఁ డనియును తెలియఁదగినది.

అవ. ప్రపంచ మెట్లు కలిగినదనుట కుత్తరమును వక్కాణించుచున్నారు.

అజ్ఞానప్రభవం సర్వం జ్ఞానేన ప్రవిలీయతే,
సంకల్పో వివిధః కర్తా విచారః సోఽయ మీదృశః. ౧౮

తా. అజ్ఞానమువలనఁ గలిగిన సకల (నామరూప స్వరూపమైన ప్రపంచము) జ్ఞానముచేత నశించుచున్నది. అనేకవిధములైన సంకల్పములకు కర్తయైనఁ దనెడిస్వభావము కలది విచార మగును.

అవ. ఉపాదానకారణలక్షణమును జెప్పుచున్నారు.

ఏతయో ర్య దుపాదాన మేకం సూక్ష్మం స దవ్యయమ్,
యథైవ మృద్ఘటాదీనాం విచారః సోఽయ మీదృశః. ౧౫

తా. ఘటము (కుండ) మొదలైనవానికి మన్ను ఉపాదానకారణమైనట్లు, అజ్ఞానసంకల్పములకు ఏకమును, సూక్ష్మమును, అవ్యయమును అగు సత్తు(త్రికాలములయందును బాధింపఁబడని బ్రహ్మము) ఉపాదానము

(తత్ప్రత్యస్థితిలయములకు కారణము) అనునట్టి లక్షణముకలది విచారమగును.

అవ. కావున, కార్యకారణభేదము వాగ్వ్యాపారముమాత్ర మనియును, అయినను జీవబ్రహ్మములకు అభేదముమాత్రము సత్యమనియును జెప్పుచున్నారు.

అహ మేకోపి సూక్ష్మం చ జ్ఞాతా సాక్షీ సదావ్యయః,
త దహం నాత్ర సన్దేహో విచారః సోఽయ మీదృశః. ౧౬

తా. నేను ఏకమును, సూక్ష్మమును, జ్ఞాతయు, సాక్షియు, సత్తయు, అవ్యయమును అయినవాఁడను. కావున ఆదే నేను, దీనికి సందేహము లేద నెడి లక్షణముకలది విచార మగును.

వి. బ్రహ్మమునకు (సజాతీయ) వేఱయిన దేదియు లేనందువలన ఏకము. అహంకారాదులను గోచరింపఁజేయు చేతనము జ్ఞాత. ఇంద్రియార్థసంబంధములేకయే గోచరించునది సాక్షి.

అవ. జీవబ్రహ్మైక్యమును అజ్ఞాను లంగీకరింపరని, అయిదుశ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభి రావృతః,
తయో రైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతఃపరమ్. ౧౭

తా. ఆత్మ నిష్కలమును, ఏకము నైనది. శరీరము శ్రోత్రము మొదలగు అనేకములయిన కలలచేత నావరింపఁబడినది. ఆ రెంటికిని * ఐక్యమును (తార్కికులు మొదలగువారు) తెలియుచున్నారు. ఇంతకంటె (జీవబ్రహ్మైక్యమును అంగీకరించుటకంటె) అజ్ఞానము వేఱే యేమున్నది ?

* దీనినే అయిదుశ్లోకముల తాత్పర్యముతోను జేర్చి చదువుకొనునది.

... నుండునది యదియో అది ఆత్మ యనఁబడును.

ఆత్మా నియామక శ్చాన్తర్దేహో బాహ్యో నియమ్యకః,
తయో రైక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞాన మతఃపరమ్. ౧౮

తా. ఆత్మ నియామకమును, పంచకోశములకు లోపల నుండునదియు నైనది. శరీరము నియమింపఁబడునదియు, వెలుపల నుండునదియు నైయున్నది. ఆరెంటికిని.....ఏమున్నది?

ఆత్మా జ్ఞానమయః పుణ్యో దేహో మాంసమయోఽశుచిః,
తయో రైక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞాన మతఃపరమ్. ౧౯

తా. ఆత్మ జ్ఞానమయుఁడును, పుణ్యస్వరూపుఁడు నై యుండువాఁడు— శరీరము మాంసమయమును, అశుచియు నైనది. ఆరెంటికిని...ఏమున్నది?

ఆత్మా ప్రకాశకః స్వచ్ఛో దేహ స్తామస ఉచ్యతే,
తయో రైక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞాన మతఃపరమ్. ౨౦

తా. ఆత్మ ప్రకాశించువాఁడును, పరిశుద్ధుఁడు నయినవాఁడు. శరీరము తామస మనఁబడును. ఆరెంటికిని......ఏమున్నది?

ఆత్మా నిత్యోహి సద్రూపో దేహో౽నిత్యో హ్యసన్మయః,
తయో రైక్యం ప్రపశ్యన్తి కి మజ్ఞాన మతఃపరమ్. ౨౧

తా. ఆత్మ నిత్యమును సద్రూపము నైనది. శరీరము అనిత్యమును అసన్మయము నైనది. ఆరెంటికిని......ఏమున్నది ?

ఆత్మన స్త త్ప్రకాశత్వం యత్పదార్థావభాసనమ్,
నాగ్న్యాదిదీప్తివ ద్దీప్తి ర్భవత్యాన్ధ్యం యతో నిశి. ౨౨

తా. పదార్థములను ప్రకాశింపఁజేయునది యేదియో అది ఆత్మ యొక్క ప్రకాశత్వ మగును. ఇది అగ్ని మొదలగువానివంటి ప్రకాశము కాదు. అప్రకాశములు రాత్రియందు ప్రకాశహీనములై పోవునట్టివి.

వి. అగ్న్యాదులకు తమంతట ప్రకాశము లేదు. అనఁగా స్వయముగాఁ బ్రకాశింపదు. ఆత్మ స్వయంప్రకాశ మైనది.

అవ. ఆత్మానాత్మాభేదమును దెలియువారిని పరిహసించి, ఆరెంటి యొక్క భేదమును నిరూపించుచున్నారు.

దేహోఽహమిత్యయం మూఢో ధృత్వా తిష్ఠత్యహో జనః,
మమాయమిత్యపి జ్ఞాత్వా ఘటద్రష్టేవ సర్వదా. ౨౩

తా. ఘటమును (కుండను) జూచువానివలె, ఈశరీరము సదా నాదియని యెఱింగియుండియు, ఈదేహము నేను అని తలంచి, మూఢులు (కృతకృత్యబుద్ధి చేత) ఊరక యున్నారు. ఇది మిగుల తెలివిలేమియే యగును.

అవ. ఇట్లు అజ్ఞానమును నిరూపించి దానిని నివర్తించునట్టి ఆత్మజ్ఞానమును జెప్పుచున్నారు.

బ్రహ్మైవాహం సమశ్శాన్తః సచ్చిదానన్దలక్షణః,
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః.

తా. నేను అమలమును, శాంతమును, సచ్చిదానందలక్షణము నైన బ్రహ్మము. * అసద్రూప మైన దేహముకాను, అనునది వివేకముగలవారిచేత జ్ఞాన మని చెప్పఁబడుచున్నది.

అవ. జననమరణాదివికారాదులతోఁ గూడినట్టి నాకు బ్రహ్మత్వ మెట్లు సిద్ధించు ననియా శంకించి చెప్పుచున్నాడు.

నిర్వికారో నిరాకారో నిరవద్యోఽహ మవ్యయః,
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః.

తా. నేను నిర్వికారుఁడను (జననమరణాదులు లేనివాఁడను), నిరాకారుఁడను (ఆకారములు లేనివాఁడను), నిరవద్యుఁడను (ఆధ్యాత్మికాది-

* దీనినే ౨౦వ శ్లోకతాత్పర్యమునందు అనుసంధించుకొనునది.

తాపత్రయములు లేనివాఁడను), అవ్యయుఁడను (నాశరహితుఁడను), అస...
చున్నది.

అవ. మఱియు జ్ఞానలక్షణమును మూఁడుశ్లోకములచే నిరూపించు చున్నారు.

నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహ మాతతః,
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః.

తా. నేను నిరామయుఁడను (రోగములేనివాఁడను), నిరాభాసు డను (వ్యాప్తిస్థితి లేనివాఁడను), నిర్వికల్పుఁడను, వ్యాపకుఁడను, అస...
చున్నది.

నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తో ఽహమచ్యుతః,
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః.

తా. నేను నిర్గుణుఁడను, నిష్క్రియుఁడను, నిత్యుఁడను, నిత్యముక్తుఁడను, అచ్యుతుఁడను (నాశములేనివాఁడను), అస......చున్నది.

నిర్మలో నిశ్చలోఽనన్తః శుద్ధోఽహ మజరోఽమరః,
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః. ౨౫

తా. నేను నిర్మలుఁడను, నిశ్చలుఁడను, అనంతుఁడను, శుద్ధుఁడను, అజరుఁడను, అమరుఁడను, అస......చున్నది.

వి. ఇరువదినాలవశ్లోకము మొదలు ఈశ్లోకమువఱకు ఆత్మలక్షణమును గూర్చియే ప్రతిపాదింపఁబడినది. విషయవివరణార్థమై ౨౪-౨౫శ్లోకములకు వేర్వేఱు అవతారికలు వ్రాయఁబడినవి.

౫౪. ఆత్మ ప్రత్యక్ష దేహము కాకపోయినను, ఆత్మకు శూన్యత్వము కలుగుననియా శంకించి యిట్లనుచున్నారు.

స్వదేహం శోభనం సంతం పురుషాఖ్యం చ సమ్మతమ్,
కిం మూర్ఖ! శూన్యమాత్మానం దేహాతీతం కరోషి భోః.

తా. ఓమూర్ఖుఁడా (శూన్యవాదీ)! నీనశరీరమునందు, పురుషుఁడను నదియును, శుభమును, ప్రతి[illegible]సమ్మతమైనదియును, ఎల్లప్పుడు నుండు నదియును (సర్వాధిష్ఠానమును), దేహాతీత మైనదియును, అగు ఆత్మను (గగనకుసుమమునలె) శూన్యమనెదవాయేమి? (అట్లనకు మనిభావము.)

౫౫. ఆత్మ, జాగ్రదాదులకును, లేక స్థూలదేహాదులకును బయట

[illegible] బడును. "అయమాత్మా బ్రహ్మ" "ఈ యాత్మ బ్రహ్మము" అనునది శ్రుతి. "ఉత్తమపురుష స్త్వన్యః" "ఉత్తమపురుషుఁడు అన్యుఁడు" అనునది స్మృతి.

అవ. ఆత్మ దేహమునకంటె వేఱయినదనుటకుఁ బ్రమాణము లేనందున, దేహమే ఆత్మ యనువాదము కలుగుననియా శంకించి చెప్పుచున్నారు.

ఆత్మానం శృణు మూర్ఖ త్వం శ్రుత్యా యుక్త్యా చ పూరుషమ్,
దేహాతీతం సదాకారం సుదుర్దర్శం భవాదృశైః. 30

తా ఓమూఢుఁడా (దేహాత్మవాదీ)! శ్రుతి ఆచార్యుఁడు శ్రద్ధ ఇవి లేనివారికి వేనిఃలనను దెలిసికొనుట కెంతమాత్రమును శక్యముకాని దేహాతీతమును, సద్రూపమునగు స్వాత్మను, శ్రుతిచేతను యుక్తిచేతను నీవు వినువాఁడ వగుదువుగాక.

౨. "తస్మాద్వా ఏతస్మా దన్నరసమయా దన్యోన్తర ఆత్మా" "అ, లేక ఈ, అన్నరసమయునికంటెను ఈ యంతరాత్మ వేఱు" అనెడి శ్రుతి చేత, ఆత్మ అన్నమయదేహమునకంటెను భిన్నమై యుండుటంబట్టి దేహాతీత మనఁబడినది.

అవ. అహం శబ్దార్థమైన ఆత్మలక్షణమును ఏడుశ్లోకములచేత విశదీకరించు చున్నారు.

అహం శబ్దేన విఖ్యాత ఏక ఏవ స్థితః పరః,
స్థూల స్త్వనేకతాం ప్రాప్తః కథం స్యా ద్దేహకః పుమాన్.

తా. ఒక్కటిగనే యుండు పరమనఁబడు ఆత్మ, అహం శబ్దముచేత

ప్రసిద్ధమైనది. అనేకత్వమైయుండు స్థూలదేహము పురుషుఁ డెట్లగును?
(అనఁగా కాఁడని భావము).

౨. అహం అనుశబ్దము నే ననెడి తెలివికి ఉపలక్షణము.

అవ. ఆత్మకును దేహమునకును గల విలక్షణమును రెండుశ్లోకముల చేతఁ జెప్పుచున్నారు.

అహం ద్రష్టృతయా సిద్ధో దేహో దృశ్యతయా స్థితః,
మమాయ మితి నిర్దేశా త్కథం స్యా ద్దేహకః పుమాన్.

తా. నేను ద్రష్ట (చూచువాఁడు) అనెడి స్థితిచేతఁ బ్రసిద్ధుఁడను; శరీరము దృశ్యము (చూడఁబడునట్టిది) అనెడి లక్షణము కలది. కాఁబట్టి దేహము పురుషుఁ డెట్లగును ?

అహం వికారహీన స్తు దేహో నిత్యం వికారవాన్,
ఇతి ప్రతీయతే సాక్షా త్కథం స్యా ద్దేహకః పుమాన్. 33

తా. నేను వికారము లేనివాఁడను; దేహము అనిత్యమును వికారమును గల దని ప్రత్యక్షముగాఁ గానఁబడు చున్నది; కాఁబట్టి దేహ మట్లు పురుషుఁడగును?

వి. జన్మించుట, ఉండుట, వృద్ధిపొందుట, హెచ్చుట, సడలుట, చచ్చుట, అనునియాఱును వికారము లనఁబడును. ఈ షడ్భావవికారములు లేనివాఁడు నిర్వికారుఁడు.

అవ. యుక్తిచేత ఆత్మలక్షణమును జెప్పి, దానినే శ్రుతిప్రమాణములతో నాలుగు శ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

యస్మాత్పరం మిదం శ్రుత్వా [illegible] పురుషలక్షణమ్,
వినిర్ణీతం విమూఢేన కథం స్యా ద్దేహకః పుమాన్. 38

తా. దేనికంటె శ్రేష్ఠమైనది యనెడి, ఆ శ్రుతిచేత పురుషలక్షణము (ఆత్మలక్షణము) విమూఢునిచేత (జ్ఞానిచేత) విచారించి నిర్ణయింపఁబడినది. కావున స్థూలదేహము పురుషుఁ డెట్లగును?

వి. "యస్మా త్పరతరం నాపరమస్తి. కిఞ్చిద్యస్మా న్నాణీయో నజ్యాయోఽస్తికశ్చిత్, వృక్షఇవ స్తబ్ధో దివితిష్ఠ త్యేక స్తేనదం పూర్ణం పురుషేణ సర్వం." "దేనికంటె అధికమైనదియును, తక్కువైనదియును, చిన్నదియును, పెద్దదియును లేదో, ఎయ్యది వృక్షమువలె కదలనిదై ఏకమై ఆకాశమునం దున్నదో, ఆపురుషునిచేత ఈసకలప్రపంచమును నిండియున్నది." అని 'తైత్తిరీయము నారాయణవల్లి'

సర్వం పురుష ఏవేతి సూక్తే పురుష సంజ్ఞితే,
అప్యుచ్యతే యతః శ్రుత్యా కథం స్యాద్దేహకః పుమాన్.

తా. వేద మనెడి పరదేవతచేత పురుషసూక్తమునందు సర్వమును పురుషుఁడే యని చెప్పఁబడియుండుటవలన దేహ మెట్లు పురుషుఁ డగును?

వి. 'పురుష ఏవేదం సర్వం' ఈసకలజగత్తును పురుషుఁడే. అని పురుషసూక్తము.

అసఙ్గః పురుషః ప్రోక్తో బృహదారణ్యకేఽపిచ,
అనన్తమల సంశ్లిష్టః కథం స్యాద్దేహకః పుమాన్. 36

తా. బృహదారణ్యకమునందు, పురుషుఁడు అసంగుఁడని చెప్పఁబడియుండుటవలన, విశేషమలములతోఁ గూడిన శరీర మేలాగు పురుషుఁ డగును ?

వి. 'అసఙ్గో హ్యయం పురుషః' ఈపురుషుఁడు అసంగుఁడు. అని బృహదారణ్యకము.

తత్రైవ చ సమాఖ్యాతః స్వయంజ్యోతి ర్హి పూరుషః,
జడః పర ప్రకాశ్యోఽసౌ కథం స్యా ద్దేహకః పుమాన్. 32

తా. ఆచోటనే (బృహదారణ్యకమునందే) పురుషుఁడు స్వయం జ్యోతిస్స్వరూపుఁడని చెప్పఁబడియుండుటవలన, వేఱొకదానిచే ప్రకాశించునట్టి జడమైనదేహము పురుషుఁ డెట్లగును ?

వి. 'అత్రాఽయం పురుషః స్వయం జ్యోతి ర్భవతి' ఇచ్చట ఈ

పురుషుఁడు స్వయంజ్యోతి యగుచున్నాఁడు. అని బృహదారణ్యకోపనిషత్.

అవ. ఇంతదనుక జ్ఞానకాండమునందలి ప్రమాణములను వచియించి యిప్పుడు కర్మకాండమునందలి దేహాత్మలకు భేదమే చెప్పఁబడియున్న దని నిరూపించుచున్నారు.

ప్రోక్తో౽పి కర్మకాణ్డేన జ్ఞాత్వా దేహాద్విలక్షణః,
నిత్యశ్చ తత్ఫలం భుఙ్క్తే దేహపాతాదనన్తరమ్. ౩౮

తా. కర్మకాండమునందును దేహమునకంటె వేఱైన ఆత్మ నిత్యుఁడై దేహము పోయినమీఁద దానిఫలమును అనుభవించుచున్నాఁ డని చెప్పఁబడి యున్నది.

౮. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" జీవించి యుండునంత వఱకు అగ్నిహోత్రమును చేయఁదగినది అని యిట్లు చిత్తశుద్ధిని కలుగఁ జేయు కర్మమును ప్రతిపాదించు వేదభాగమునందును జెప్పఁబడియున్నది. చకారమువలన న్యాయసాంఖ్యమతములందును దేహాత్మలకు భేదమే చెప్పఁ బడి యున్నదని యెఱుఁగఁదగినది.

౫౫. లింగముకూడ పురుషుఁడు కాఁడని చెప్పుచున్నారు.

లిఙ్గం చానేకసంయుక్తం చలం దృశ్యం వికారి చ,
అవ్యాపక మసద్రూపం తత్కథం స్యా త్పుమాయసమ్.

తా. లింగదేహముకూడ, అనేకములతోఁ గూడినదియును చంచలమును దృశ్యమును వికారిత్వమును అవ్యాపకమును అసద్రూపమును నై

యుండుటవలన అదెట్లు ఈపురుషుఁడగును? అనఁగా లింగదేహము పురుషుఁడు కాఁడని భావము.

౨. చకారమువలన కారణశరీరమును నిరాకరింపఁబడినది.

అవ. ఇంతదనుక చెప్పఁబడిన విషయముల నుపసంహరించి యిప్పుడు పురుషస్వరూప మిట్టిదని నిరూపించుచున్నాఁడు.

ఏవం దేహద్వయాదన్య ఆత్మా పురుష ఈశ్వరః,
సర్వాత్మా సర్వరూప శ్చ సర్వాతీతోఽహ మవ్యయః. ౪౦

తా. ఇట్లు శరీరములు రెంటికిని వేఱైన ఆత్మయనెడి పురుషుఁడు ఈశ్వరుఁడును, సర్వాత్మయును, సర్వరూపమును, సర్వాతీతమును, నే

నసెడి ప్రత్యయమునకు ఆలంబనమైన జ్ఞానస్వరూపమై యుండునదియును. అవ్యయమనని తెలియునది.

౨. పురుషుఁడు జీవుఁడు కాదనుటకై ఈశ్వరుఁ డనువిశేషణము చెప్పఁబడినది. ఈశ్వరుఁ డనుటకుఁ గారణముగా సర్వాత్మయని చెప్పఁ బడెను. అట్లైనచో అద్వైతమునకు హాని కల్గునని తలంచి సర్వరూపమని చెప్పఁబడెను. ఇట్లనుటవలన వికారిత్వము సంభవించునని భావించి సర్వాతీతమని చెప్పఁబడినది. ఇవ్విధముగాఁ జెప్పినందున ప్రత్యక్షము కావలయు ననియును, ప్రత్యక్షమే నేననెడి యహంకారము కల్గుననియును ఆలోచించి అవ్యయమని చెప్పఁబడెను.

౩. ఆత్మకును శరీరమునకును భేదము కలదనెడి తార్కికుని యభిప్రాయ మనర్థమని చెప్పుచున్నారు.

ఇత్యాత్మ దేహభాగేన ప్రపఞ్చస్యైవ సత్యతా,
యథోక్తా తర్కశాస్త్రేణ తతః కిం పురుషార్థతా. ౪౧

తా. ఇట్లు ఆత్మ దేహ విభాగముచేత, ప్రపంచమునకే తర్కశాస్త్రమునందుఁ జెప్పఁబడినరీతిగా సత్యత్వము చెప్పఁబడినది. అందువలన పురుషార్థమేది? (అనఁగా పురుషార్థము లేదని భావము).

వి. "ద్వితీయాద్వై భయంభవతి" అనఁగా రెండవదానివలన భయము కలుగుచున్నది. అనెడి శ్రుతివాక్యముచే భేదమువలన ప్రయోజనములేదు.

అవ. ఆత్మ దేహవిభాగము అనర్థము కాదనుచున్నారు.

ఇత్యాత్మ దేహభేదేన దేహాత్మత్వం నివారితమ్,

ఇదానీం దేహభేదస్య హ్యాసత్త్వం స్ఫుట ముచ్యతే. ౪౨

తా. ఈప్రకారముగా ఆత్మ దేహభేదముచేత దేహాత్మత్వము నివర్తింపఁబడినది. ఇప్పుడు దేహభేదముయొక్క అసత్త్వస్థితి చక్కఁగాఁ జెప్పఁబడినది.

వి. దేహాత్మతత్త్వము నివర్తింపఁబడినందున చార్వాకమతము నిరసింపఁబడినది. దేహభేదముయొక్క అసత్త్వస్థితిని (అనఁగా ఆత్మసత్తకంటె వేఱైన సత్తలేనిదానిని) స్పష్టముగాఁ జెప్పఁబడినది.

అవ. పైని చెప్పఁబడిన భేదమును, ఆభేదము మిథ్యయనియును దృష్టాంతముతో మూఁడుశ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

చైతన్యస్యైకరూపత్వా ద్భేదో యుక్తో న కర్హిచిత్,
జీవత్వం చ మృషా జ్ఞేయం రజ్జౌ సర్పగ్రహో యథా. ౪౩

తా. చైతన్యము ఏకరూపమై యుండుటవలన, ఏస్థితియందును దానికి భేదము సంబంధించునది కాదు. జీవత్వమును రజ్జువునందు సర్పజ్ఞానమువలె మిథ్య యని తెలియఁదగినది.

వి. సకల భూతభౌతిక ప్రపంచముయొక్క అధిష్ఠానముగాఁ బ్రకాశించుటంబట్టి చైతన్య మనఁబడును.

రజ్జ్వజ్ఞానాత్ క్షణే నైవ యద్వ ద్రజ్జుర్హి సర్పిణీ,
భాతి తద్వ చ్చితిః సాక్షా ద్విశ్వాకారేణ కేవలా. ౪౪

తా. రజ్జువుయొక్క అజ్ఞానము (దారమును పామనుట) వలన, క్షణములో రజ్జువు సర్పముగాఁ గనఁబడునట్లు, కేవలము చిత్తు ప్రపంచస్వరూపముగాఁ గనఁబడుచున్నది.

వి. కేవలము నెడివిశేషణమువలన పూర్వస్థితిని విడలకయు, వేఱురూప మును బెందనిదియునగు వివర్తోపాదానత్వము చెప్పఁబడినది. ఆరంభోపా దానత్వమును, పరిణామోపాదానత్వమును చెప్పఁబడలేదని యెఱుఁగునది. ఘటమునకు మృత్తును, ఆభరణమునకు స్వర్ణమును ఉపాదాన మగునట్లు ప్రపంచమునకు బ్రహ్మము ఉపాదాన మగును.

ఉపాదానం ప్రపఞ్చస్య బ్రహ్మణోన్య న్నవిద్యతే,
తస్మాత్సర్వప్రపఞ్చోఽయం బ్రహ్మైవాస్తి నచేతరత్.

తా. ప్రపంచముయొక్క ఉపాదానము బ్రహ్మముకంటె వేఱైనది కాదు; కావున ఈసకలజగత్తును బ్రహ్మమే; వేఱుకాదు.

వి. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః" "ఆ, లేక, ఈ యాత్మవలననుండి ఆకాశము కలిగెను." అను నీమొదలగు శ్రుతులవలన

ఆకాశాది దేహాంతమువఱకుఁగల ప్రపంచవిస్తారమునకు మాయతోఁగూడిన బ్రహ్మచైతన్యముకంటె వేఱే పరమాణువులును, ప్రకృతియును, కారణ విశేషమైన ఉపాదానము కాదు.

అవ. వ్యాప్యవ్యాపకస్థితిస్వరూపభేద ముండుటవలన ప్రపంచము నకు బ్రహ్మత్వ మెట్లు సిద్ధించుననియూ శంకించి చెప్పుచున్నారు.

వ్యాప్యవ్యాపకతా మిథ్యా సర్వ మాత్మేతి శాసనాత్,
ఇతి జ్ఞాతే పరే తత్త్వే భేదస్యావసరః కుతః. ౨౬

తా. సమ స్తమును ఆత్మ యనెడి శ్రుతియైన ఈశ్వరాజ్ఞాబలమువలన వ్యాప్యవ్యాపకత్వస్థితి (లోపల వెలుపల ననెడిస్థితి) మిథ్య యని తెలిసిన

ప్పుడు, పరతత్త్వమానందు భేదముయొక్క అవసర మెక్కడిది? (అనఁగా లేదని భావము).

వి. "తత్సర్వం య దయ మాత్మా" "సమస్తమును ఆత్మయే" అని శ్రుతి.

అవ. ప్రత్యక్షమైన వ్యాప్యవ్యాపకత్వస్థితి యేరీతిగా మిథ్య యగు ననియా శంకించి చెప్పుచున్నారు.

శ్రుత్యా నివారితం నూనం నానాత్వం స్వముఖేన హి,
కథం భాసో భవే దన్యః స్థితే చాద్వయకారణే. ౪౭

తా. నిశ్చయముగా శ్రుతి తనముఖముచేత ప్రసిద్ధముగా నానాత్వము ను నివరించునట్లు (మనస్సు), అద్వయకారణము (బ్రహ్మము) నందు

నెలకొనియుండునపుడు అన్యమైన (వ్యాప్యవ్యాపకత్వమైన) వస్తు వెట్లు కలుగును' (అనఁగా దేనిచేతను గలుగదని భావము).

వి "నేహ నానాస్తికిఞ్చన" "ఇచ్చట నానాత్వము ఎంతమాత్రమును లేద"ని శ్రుతి. సాలెపురుగు నూలికి ఉపాదానమును నిమిత్తము నైనట్లు, బ్రహ్మమొకటే ప్రపంచమునకు ఉపాదానమును నిమిత్తము నైయున్నది. అద్వయకారణమనఁగా, అభిన్ననిమిత్తోపాదాన మనిపేరు. అనఁగా, నిమిత్తమును ఉపాదానమును వేఱుకాకుండుట.

అవ. శ్రుతియందు భేదదృష్టికి దోషము వినఁబడినప్పటికిని కారణము కంటె కార్యము వేఱుకాదని వచించుచున్నారు.

దోషోపి విహితః శ్రుత్వా మృత్యోర్మృత్యుం స గచ్ఛతి,
ఇహ పశ్యతి నానాత్వం మాయయా వఞ్చితో నరః. ౨౮

తా. మాయచే వంచింపఁబడినవాఁడు, ఇచట నానాత్వమును జూచుచున్నాఁడు. వాఁడు మృత్యువునుండి మృత్యువును బొందుచున్నాఁడు. అనెడి విహితశ్రుతిచేత భేదదృష్టియొక్క దోషము వినఁబడుచున్నది.

వి. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" "ఎవఁడు ఇచ్చట అనేకమును జూచుచున్నాఁడో వాఁడు మృత్యువునుండి మృత్యువును బొందుచున్నాఁడు." అని కఠవల్ల్యుపనిషత్తు.

అవ. భేదదృష్టి దోషనివృత్తికి యుక్తిని జెప్పుచున్నారు.

బ్రహ్మణః సర్వభూతాని జాయన్తే పరమాత్మనః,

తస్మా దేతాని బ్రహ్మైవ భవన్తీ త్యవధారయేత్. ౪౯

తా. బ్రహ్మము (అపరిచ్ఛిన్నము) అయినట్టి పరమాత్మయందుండి సకలభూతములును కలిగినవి. కావున, ఇవి బ్రహ్మమే యగుచున్న వని నిశ్చయింపవలసినది.

౨. "యతో వా ఇమానిభూతానిజాయన్తే యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తీతి, తద్విజిజ్ఞాసస్వ,తద్బ్రహ్మేతి" "దేనినుండి ఈ భూతములన్నియుఁ గల్గినవో, దేనిచేతఁ గలిగిన భూతములన్నియు జీవించుచున్నవో, వినాశకాలమునందు ఏబ్రహ్మమునందుఁజేరి తాదాత్మ్యము నే

పొందుచున్నవో, దానిని (అది బ్రహ్మము) అని తెలియుదువుగాక" అని తైత్తిరీయ శ్రుతి.

అవ. నానానామరూపకర్మ భేదములవలన విచిత్రము లైన భూతము లెట్లు బ్రహ్మస్వరూప మగునని యాశంకించి చెప్పుచున్నారు.

> బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధాని చ,
> కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శ్రుతి ర్జగౌ. ౫౦

తా. సమస్త మైన నామములను, అనేకవిధము లైన రూపములను, సకలకర్మములను, బ్రహ్మమే ధరించుచున్నదని శ్రుతి చెప్పుచున్నది.

అవ. పైని చెప్పినదానినిగూర్చి ప్రసిద్ధమైన దృష్టాంతముచేత దృఢపఱుచుచున్నారు.

సువర్ణా జ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్,
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్.

తా. స్వర్ణమునుండి కలిగినదానికి స్వర్ణత్వము శాశ్వతమగునట్లు, బ్రహ్మమునుండి కలిగినదానికి బ్రహ్మత్వము శాశ్వత మగును.

అవ. జీవాత్మపరమాత్మలకు భేదము కలదనువానికి భయముకలదని చెప్పుచున్నారు.

స్వల్పమప్యన్తరంకృత్వా జీవాత్మపరమాత్మనోః,
యః సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితమ్. ౫౨

[illegible]
కల్పించుచున్నాఁడో, వానికి భయము చెప్పఁబడి యున్నది.

ఎ. "యదా హ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే, అథ తస్య భయం భవతి." "ఎప్పుడు వీఁడు దీనియందు కొంచెమైనను భేదమును జూచుచున్నాఁడో, అప్పుడు వీనికి భయము కల్గుచున్నది. (అనఁగా భేద దృష్టిగలవానికి భయము కలుగును గాని సుఖము కలుగదని భావము.) అని తైత్తిరీయ శ్రుతి.

అవ. ప్రకాశమును చీఁకటియునవలె పరస్పరవిరుద్ధమైన జీవాత్మ పరమాత్మల భేదాభేదము (ద్వైతాద్వైతము) అవస్థాభేదముచేఁ గల్గుచున్నదని వక్కాణించుచున్నారు.

యత్రాజ్ఞానా ద్భవే ద్ద్వైత మితరస్తత్ర పశ్యతి,
ఆత్మత్వేన యదా సర్వం నేతరస్తత్ర చాణ్వపి. ౧౩౩

తా. ఎప్పుడు (ఏయజ్ఞానదశయందు) అజ్ఞానమువలన ద్వైతమువలె నగుచున్నదో, అప్పుడు అన్యుఁడు అన్యమును జూచుచున్నాఁడు. ఎప్పుడు (జ్ఞానదశయందు) సర్వమును ఆత్మత్వమును బొందుచున్నదో, అప్పుడు (జ్ఞానావస్థయందు) అన్యుఁడు కొంచెమైనను వేఱే దేనిని జూచుట లేదు. అనఁగా కార్యముతో అజ్ఞానము నివృత్తి యగుచున్న దని భావము).

వి. "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి." "ఎప్పుడు ద్వైతమువలె నగుచున్నదో, అప్పుడు

... ఇతరమును గాంచుచు

Funding: Tattva Heritage Foundation, Kolkata. Digitization: eGangotri.

పశ్యేత్." "ఎప్పుడు వీనికి సమస్తమును ఆత్మయే యగుచున్నదో, అప్పుడు దేనిచేత దేనిని జూచును," అనియు బృహదారణ్యకమునందు చెప్పఁబడి యున్నది.

అవ. జీవాత్మపరమాత్మలకు భేదము లేదనెడి జ్ఞానము కలవానికిఁ గలుగు ప్రయోజనమును చెప్పుచున్నారు.

యస్మిన్సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః,
నవై తస్య భవేన్మోహో న చ శోకోఽద్వితీయతః. ౧౮

తా. దేనియందు సకలభూతములను ఆత్మగాఁ జూచుచున్నాఁడో, ఆస్థితియందు వానికి మోహము కలుగదు; శోకము లేదు. అనఁగా అద్వితీయ మగుటచేత (రెండవది లేదనెడి భావముచేత) నని యభిప్రాయము.

వి. "యస్మిన్ సర్వాణి అత్మైవాభూత్ విజానతః, తత్ర కో మోహః క శ్శోక ఏకత్వమనుపశ్యతః." "ఏయాత్మయందు పరమార్థము గాఁ జూచువానికి సకలభూతములును అత్మయే యగుచున్నవో, ఆయాత్మ యందు ఐక్యమును జూచెడివానికి మోహ మేది? శోక మేది? అని ఈ శా వాస్య శ్రుతి.

అవ. సర్వమును బ్రహ్మమే యని శ్రుతివాక్యముచే నిరూపించు చున్నారు.

అయ మాత్మా హి బ్రహ్మైవ సర్వాత్మక తయాస్థితః,

ఇతి నిర్ధారితం శ్రుత్యా ...

టీ. సర్వాత్మత్వముగ నుండునట్టి ఈయాత్మ బ్రహ్మమే యని బృహ

దారణ్యమనెడి శ్రుతిచేత నిశ్చయింపఁబడియున్నది.

వి. "సవా అయమాత్మా బ్రహ్మవిజ్ఞానమయః" "ఆ, లేక, ఈ యాత్మ బ్రహ్మవిజ్ఞానమయుఁడు." అని బృహదారణ్యకము.

అవ. ఈప్రపంచము అసద్రూపమని దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

అనుభూతో೭ప్యయం లోకో వ్యవహారక్షమో೭పిసన్,
అసద్రూపో యథా స్వప్న ఉత్తరక్షణ బాధతః. ౫౭

తా. ఈలోకము అనుభవింపఁబడునది యైనను, వ్యవహారసామర్థ్యముకలది యైనను, స్వప్నమువలె ఉత్తరక్షణమునందు బాధకమై (మిథ్య యని నిశ్చయింపఁబడినదై) యుండుటచేత అసద్రూపమగును.

అవ. మీఁదఁ జెప్పినదానినే వేఱువిధముగా వివరించి చెప్పు చున్నారు.

స్వప్నో జాగరణేఽలీకః స్వప్నేఽపి జాగరో నహి,
ద్వయ మేవ లయే నాస్తి లయోఽపి హ్యుభయో ర్నచ.

తా. స్వప్నము జాగ్రమునందు మిథ్య, జాగ్రము స్వప్నమునందు లేదు, ఆజాగ్రత్స్వప్నములు రెండును లయమైన సుషుప్తియందు లేదు. సుషుప్తి ఆజాగ్రత్స్వప్నములు రెంటియందును లేదు.

అవ. ఇదివఱకు వ్యాఖ్యానించినవిషయము నుపసంహరించి, సదృష్ట

అస్య ద్రష్టా గుణాతీతో నిత్యో హ్యేక శ్చిదాత్మనః. ౫౮

తా. త్రిగుణములచేఁ గల్పింపఁబడిన మూఁడవస్థలును మిథ్యయే. వీని యొక్క ద్రష్టగుణాతీతమును నిత్యమును ఏకము నైన చిదాత్మయే.

వి. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి త్రిగుణములు. జాగ్రము, స్వప్నము, సుషుప్తి అనునవి త్రివిధావస్థలు.

అవ. త్రివిధావస్థలు మిథ్యయైనను, జీవుఁడు సత్యమా యని యాశంకించి దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

యద్వ న్మృది ఘట భ్రాన్తిః శుక్తౌ వా రజత స్థితిః,
తద్వ ద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణేన పశ్యతి. ౫౯

తా. మృత్తికయందు ఘటభ్రాంతియు, శుక్తియందు రజతభ్రాం-

యును వలె, బ్రహ్మమునందు జీవస్థితిని విమర్శించిచూచినచో (ఆత్మతత్త్వముగాఁ జూచినచో) కనఁబడుట లేదు.

అవ. అజ్ఞానావస్థయందుఁ దోఁచెడి జీవబ్రహ్మభేదము నామమాత్రమని దృష్టాంతములో నిరూపించుచున్నారు.

యథా మృది ఘటో నామ కనకే కుణ్డలాభిధా,
శుక్తౌ హి రజతఖ్యాతిః జీవశబ్ద స్తథా పరే. ౬౦

తా. మట్టియందు కుండ యనెడి పేరును, స్వర్ణమునందు కుండల మనెడి నామమును, ముత్తెపు చిప్పయందు వెండి యనెడి పేరును వలె,

చెప్పుచున్నారు.

యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే,
పురుషత్వం యథా స్థాణౌ తద్వ ద్విశ్వం చిదాత్మని. ౬౧

తా. ఆకాశమునందు నల్పును, ఎండమావులయందు జలమును, స్థాణువు (మొద్దు) నందు మనుష్యత్వమును (పురుషుడనెడి భ్రాంతియును) ఎలె, చిదాత్మయందు (పరబ్రహ్మమునందు) ప్రపంచము కనబడుచున్నది.

యథైవ శూన్యే వైతాళో గన్ధర్వాణాం పురం యథా,
యథాకాశే ద్విచన్ద్రత్వం తద్వ త్సత్యే జగత్ స్థితిః. ౬౨

తా. ఏరీతిగా, శూన్యమునందు బేతాళ స్వరూపమును, గంధర్వనగ

రము నున్నవో, ఆకాశమునందు ఇర్వురు చంద్రులు కలరో, అరీతిగా లోకస్థితి యున్నది. (అనఁగా సత్యమునందు లేదని భావము.)

వి. మేఘములవలన రాజనగరమువలె నలుపుగను బంగారు వన్నెగను కలిగి మఱిగిపోవునది గంధర్వనగర మనఁబడును.

యథా తరఙ్గ కల్లోలై ర్జల మేవ స్ఫుర త్యలమ్,
పాత్రరూపేణ తామ్రం హి బ్రహ్మాణ్డౌఘై స్తథాత్మనా.,

తా. నీళ్లు అలలు మొదలగునవిగను, తామ్రము పాత్ర స్వరూపముగను కనఁబడునట్లు, ఆత్మ బ్రహ్మాండములుగాఁ గానంబడుచున్నది.

తా. పృథ్వి (మన్ను) ఘట మను పేరుచేతను, నూలు పట (వస్త్ర) మనెడి నామముచేతను ప్రకాశించునట్లు; చిత్తు జగమనెడి పేరుచేతఁ బ్రకాశించుచున్నది. దాని (ఆపేర్లయొక్క) అభానముచేత అది (బ్రహ్మము) తెలియఁదగినది.

౭. "వాచారమ్భణం వికారో హి నామధేయం మృత్తికే త్యేవ సత్యమ్." "నామధేయమైన వికార మనునది వాగాశ్రయ మగును. (అనఁగా సత్యవస్తువు కాదు.) మృత్తికయే సత్యవస్తు వగును" అని శ్రుతి.

అవ. ఖీఁదఁజెప్పిన దృష్టాంతములవలన అనస్థాత్రయ విదేహ ముక్తియే సిద్ధించు చున్నది. జీవన్ముక్తి చెప్పఁబడలేదనియాశంకించి యిట్లని చెప్పుచున్నారు.

సర్వోఽపి వ్యావహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః,
అజ్ఞానా న్నవిజానన్తి మృదేవ హి ఘటాదికమ్. ౬౫

తా. జనులచేత సమస్త వ్యవహారమును బ్రహ్మముచేఁ జేయఁబడుచు న్నది. ఘటాదులు మృత్తికయే యని అజ్ఞానమువలనఁ దెలిసికొనుట లేదు.

వి. అజ్ఞాననివృత్తియే (ద్వైతభావము లేమియే) జీవన్ముక్తి యనఁ బడును.

అవ. మీఁదఁజెప్పిన విషయమును దృష్టాంతములోఁ జెప్పుచున్నారు.

కార్యకారణతా నిత్య మాస్తే ఘట మృదో ర్యథా,

డున్నట్లే, శ్రుతియుక్తులచేత ప్రపంచమునకును బ్రహ్మమునకును ఇచట కార్య కారణత్వ మున్నది.

౨. "యథా సౌమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్." "ఓ సౌమ్యుఁడా! ఎట్లు ఒక మంటిముద్దచేత సమస్తమును మన్నుయొక్క స్వరూపమేయని తెలియఁబడుచున్నదో" అను నీ మొదల గునవి శ్రుతులు. కార్యకారణములకు భేదముండు నేని ఒక్క కారణము నెఱుంగుటవలన సకల కార్యములయొక్క జ్ఞానము కలుగఁగూడదను నీ మొదలైనవి యుక్తులు.

అవ. కార్యకారణత్వము భిన్నత్వము కానేరదని వచించుచున్నారు.

గృహ్యమాణే ఘటే యద్వ న్మృత్తికాభాతివై బలాత్,

వీక్ష్యమాణే ప్రపఞ్చేఽపి బ్రహ్మైవాభాతి భాసురమ్. ౬౨

తా. ఘటము తెలియునప్పుడు అత్యంతము మృత్తికయగునట్లు, విచారించిచూడఁగా ప్రపంచమును ప్రమాణాపేక్ష లేకయే ప్రకాశించునట్టి బ్రహ్మముగనే ప్రకాశించు చున్నది.

అవ. అవస్థాభేదముచేత ప్రపంచమును బ్రహ్మమును గోచరించు నని దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

సదైవ ఆత్మా విశుద్ధోఽస్తి హ్యశుద్ధో భాతి వై సదా,
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్. ౬౩

తా. ఎట్లు రజ్జువు, జ్ఞానులకు [illegible]



[illegible]

[illegible] భేదమును కలిగించనిదిగను, [illegible]

[illegible] దోఁచునో, అట్లే ఆత్మయు, జ్ఞానులకు సర్వదా శుద్ధముగను, అజ్ఞానులకు ఎల్లప్పుడును అశుద్ధముగను నుండునట్లు తోఁచుచున్నది.

అవ. ఆత్మానాత్మవిభేదమును అవివేకు లెఱుఁగ రని దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

యథైవ మృణ్మయః కుమ్భ స్తద్వద్దేహోపి చిన్మయః,
ఆత్మానాత్మవిభాగోఽయం ముధైవ క్రియతేఽబుధైః. ౬౯

తా. ఘటము మృత్తికామయమగునట్లు, దేహమును చిన్మయముగ నున్నది. ఇట్లు, ఈయాత్మానాత్మవిభాగము అవివేకులచేత వ్యర్థముగ నే చేయఁబడుచున్నది.

అవ. అవివేకులయొక్క కల్పితదేహతాదాత్మ్యమును దృష్టాంతములో అయిదు శ్లోకములచే జెప్పుచున్నారు.

సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా,
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా. ౭౦

తా. రజ్జువు (దారము) సర్పత్వముగను, శుక్తి (ముత్తెపుచిప్ప) రజతస్థితిగను, నిర్ణయింపఁబడునట్లు, ఆత్మ, దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తన్తవః,
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా.

…త్వేన తథాత్మతా. ౨౧

తా. మృత్తు ఘటత్వముగను, తంతువులు పటత్వముగను నిశ్చయింపఁబడునట్లు, ఆత్మ దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

కనకం కుణ్డలత్వేన తరఙ్గత్వేన వై జలమ్,
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా. ౨౨

తా. కనకము కుండలత్వముగను జలము అలలవలెను నిశ్చయింపఁబడునట్లు, ఆత్మ దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

నరత్వేన యథా స్థాణు ర్జలత్వేన మరీచికా,
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా. ౨౩

తా. స్థాణువు పురుషత్వముగను, ఎండమావులు జలత్వముగను, నిశ్చయింపఁబడినట్లు ఆత్మ దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

గృహత్వే నైవ కాష్ఠాని ఖడ్గత్వే నైవ లోహతా,
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా. ౬౮

తా. మ్రానులు గృహములుగను, ఇనుము కత్తిగను, నిశ్చయింపఁ బడినట్లు, ఆత్మ దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

అవ. ఆత్మస్థితిని తెలిసికొనక యుండుటకుఁ గారణము అజ్ఞానమే యని దృష్టాంతపూర్వకముగా పండ్రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నారు.

యథా వృక్షవిపర్యాసో జలాద్భవతి కస్యచిత్.
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౬౯

తా. ఒకనికి నీటివలన వృక్షముయొక్క తల క్రిందుస్థితి గోచరించు నట్లు అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

పోతేన గచ్ఛతః పుంసః సర్వం భాతీవ చఞ్చలమ్,
తద్వదాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౭౬

తా. ఓడలో పోవునట్టివానికి సర్వము చంచలముకలవిగాఁ దోఁచునట్లు అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

పీతత్వం హి యథా శుభ్రే దోషాద్భవతి కస్యచిత్,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౭౭

తా. దోషముచే నొకనికి తెల్లనిదానియందు పచ్చనిరంగు కనఁబడునట్లు, అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

చక్షుర్భ్యాం భ్రమశీలాభ్యాం సర్వం భాతి భ్రమాత్మకమ్,
తద్వ ద్దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౭౯

తా. భ్రమించు (తిరిగెడు) స్వభావముగల నేత్రములచేత, సమస్తము తిరుగుచున్నట్లుగా కనఁబడునట్లు, అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

అలాతం భ్రమణే నైవ వర్తులం భాతి సూర్యవత్,
తద్వ ద్దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౮౦

తా. కొఱవికట్టెను త్రిప్పుటవలన [illegible]

నట్లు, అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహాత్వమును జూచుచున్నాఁడు.

మహత్త్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతిదూరతః,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౮౦

తా. సమస్తవస్తువులయొక్క మహత్త్వమును అతిదూరముచేత అణుత్వముగాఁ గనఁబడునట్లు, అజ్ఞానవశముచేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

సూక్ష్మత్వే సర్వభావానాం స్థూలత్వం చోపనేత్రతః,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౮౧

తా. సకలవస్తువులయొక్క సూక్ష్మత్వమును ఉపనేత్రము (సులో

చనముకెడి దర్పణవిశేషము) జలన, స్థూలత్వముగాఁ గనఁబడునట్లు, అజ్ఞానవశము చేత, ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

కాచభూవకా జలత్వం వా జలభూనూ హి కాచతా,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౧౨

తా. స్ఫటికభూమియందు జలత్వమును, జలభూమియందు స్ఫటికత్వమును గనఁబడునట్లు, అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

...వహ్నిత్వం పుమాన్,



తద్వ ద్దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౭౩

తా. అగ్నియందు రత్నత్వమును, రత్నమునందు అగ్నిత్వమును పురుషునకుఁ గానంబడునట్లు, అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

అభ్రేషు సత్సు ధావత్సు సోమో ధావతి భాతి వై,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౭౪

తా. మేఘములు పోవుచుండఁగా చంద్రుఁడు పరుగెత్తుచున్నట్లు కనఁబడుటవలె, అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్,

తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః. ౮౫

తా. ఒకనికి మోహమువలన దిగ్భ్రమము (దిక్కు ఇట్టిదని తెలియమి) కలుగునట్లు, అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

యథా శశీ జలేభాతి చఞ్చలత్వేన కస్యచిత్,
తద్వ దాత్మని దేహత్వం పశ్య త్యజ్ఞానయోగతః.

తా. ఒకనికి జలమునందు చంద్రుఁడు చంచలము కలదిగాఁ గానంబడునట్లు, అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

అవ. మీఁదఁ జెప్పఁబడిన అధ్యాసము ఆత్మజ్ఞానముచేత నివర్తించునని రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.

ఏవ మాత్మ న్యవిద్యాతో దేహాధ్యాసో హి జాయతే,
ఏవ మాత్మ పరిజ్ఞానా ల్లీయతే చ పరాత్మని. ౮౭

తా. ఇట్లు ఆత్మయందు అవిద్యవలన దేహాధ్యాసము కలుగుచున్నది. అదియే ఆత్మజ్ఞానమువలన పరమాత్మయందు లయ మగుచున్నది.

సర్వ మాత్మతయా జ్ఞాతం జగత్ స్థావర జఙ్గమమ్,
అభావా త్సర్వభావానాం దేహస్య చాత్మతా కుతః.

తా. స్థావరజంగమాత్మక మైన ప్రపంచమంతయు ఆత్మగాఁ దెలియఁబడుచున్నది. సకలభావములును (స్థితులు) లేకపోయినపుడు, శరీరమునకు ఆత్మస్థితి యెక్కడిది ? (అనఁగా లేదని యభిప్రాయము)

అవ. జ్ఞానులకు నిష్ప్రపంచస్వరూపము గోచరించుటవలన నజ్ఞానుల

కేమి లాభము ? అని ప్రశ్నరాఁగా అజ్ఞానులకుఁగూడ ఆత్మజ్ఞానోదయము కలుగుట కుపాయమును జెప్పుచున్నారు.

ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహామతే,
ప్రారబ్ధ మఖిలం భుఞ్జ న్నోద్వేగం కర్తు మర్హసి. ౮౯

తా. మహామతీ (నీవు) ఆత్మను నిరంతరమును దెలిసికొనుచు కాలమును గడపుచుందువుగాక. (అనంతరము) ప్రారబ్ధ మంతయు ననుభవించువాఁడై చిత్తక్షోభమును పొందకుందుము.

సాధనసంపత్తి గలవాఁడని భావము. అనఁగా కామాదులను జయించిన వాఁడని తాత్పర్యము.

అవ. ప్రారబ్ధముయొక్కయు, తన్నివృత్తియొక్కయు, రహస్యమును నాలుగు శ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైవ ముఞ్చతి,
ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియ తేఽధునా. ౯౦

తా. ఆత్మజ్ఞానముకలిగినను ప్రారబ్ధము విడుచుటలేదని శాస్త్రమునం దెయ్యది వినఁబడుచున్నదో, అది యిప్పుడు నిరాకరింపఁబడుచున్నది.

వి. సకలవ్యవహారకారణమైన అజ్ఞానము నివృత్తియైన మీఁద ప్రారబ్ధములేదని భావము.

తత్త్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే,
దేహాదీనా మసత్త్వాత్తు యథా స్వప్నే విబోధతః. ౯౧

తా. మేలుకొనిన తర్వాత కల లేనియట్లు, తత్త్వజ్ఞానోదయమైన తర్వాత దేహాదులు అసత్తగుటవలన ప్రారబ్ధము లేదు.

కర్మ జన్మాన్తరీయం య త్ప్రారబ్ధ మితి కీర్తితమ్.
తత్తు జన్మాన్తరాభావాత్ పుంసో నైవాస్తి కర్హిచిత్. ౯౨

తా. జన్మాంతరకర్మ మెయ్యదియో, అది ప్రారబ్ధ మనఁబడును. పురుషునకు జన్మాంతరము లేనందునవలన అది కొంచెమైనను లేదు.

వి. కర్మము. 1. సంచితము, 2 ఆగామి, 3 ప్రారబ్ధ మని త్రివిధము జన్మములకు కారణమైనది సంచితము. 2 వర్తమాన శరీరభోగముల నిమిత్తము చేయునది ఆగామి(క్రియమాణము). 3 వర్తమానశరీరమునకు కారణమైనది ప్రారబ్ధము. సంచితకర్మము రాఁగలశరీరముకొఱకే యైనను, అది రాఁగల శరీరమునకు ప్రారబ్ధ మగుటచేత, ఇచట జన్మాంతరమని చెప్పఁబడినది.

స్వప్న దేహో యథాఽధ్య స్త స్తథైవాయం హి దేహకః,
అధ్య స్తస్య కుతో జన్మ జన్మాభావే హి తత్కుతః. — 3

తా. స్వప్నదేహమువలె ఈదేహమును అధ్యస్తమై (కల్పింపఁబడినదై) యున్నది. అధ్యస్తమునకు జన్మ మెక్కడిది? జన్మము లేనపుడు ప్రారబ్ధ మెక్కడిది? (అనఁగా లేదని భావము.)

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



అవ. దేహాది ప్రపంచము బ్రహ్మమునుండి కలిగినదని శ్రుతిప్రమాణము లుండుట వలన నెట్లు అధ్యస్థ మగుననియా శంకించి చెప్పుచున్నారు.

ఉపాదానం ప్రపఞ్చస్య మృద్భాణ్డస్యేవ కథ్యతే,
అజ్ఞానం చైవ వేదాన్తై స్తస్మిన్నష్టే క్వ విశ్వతా. ౯౪

తా. భాండమునకు మృత్తికవలె ప్రపంచమునకు అజ్ఞానము ఉపాదానమని వేదాంతములచేత చెప్పఁబడుచున్నది. అజ్ఞానమే నశించినయెడల ప్రపంచత్వ మెక్కడిది ? (అనఁగా లేదని భావము).

వి. ఉత్పత్తి స్థితి లయములకు కారణ మైనది ఉపాదానము.

ఉత్పత్తి మాత్రమునకుఁ గారణమైనది నిమిత్తము. చకారమువలన "యతో వా ఇమాని భూతాని జాయన్తే" "దేనినుండి ఈభూతములు కల్గినవో" అనెడి శ్రుతిప్రమాణము ననుసరించి బ్రహ్మమే ఉపాదాన మని తాత్పర్యము.

అయినను, కేవలము బ్రహ్మము (నిర్వికారమై యుండుటవలన) జగత్కారణము కాదు. కేవలము అజ్ఞానము (జడమై యుండుటవలన) జగత్కారణము కాదు. కాఁబట్టి రెంటియొక్క చేరికచేతనే జగత్కారణమగుచున్నది. "సత్యానృతే మిథునీకరోతి" "సత్యము అసత్యము అను ఈరెంటిని చేర్చుచున్నాఁడు" అని శ్రుతి.

ఈచెప్పిన దృష్టాంతములందు జలస్థానమునందు బ్రహ్మమును, (అనఁగా మట్టిని పిండముచేయునట్టి శక్తికలది జలమనియును,)మృత్ స్థానమునందు

అజ్ఞానమును. (అనఁగా మఱుగించు శక్తికలది వృత్తికయనియును) ఎఱుంగునది.

అవ. మూఢునకు ప్రపంచము సత్యముగాఁ దోఁచునని దృష్టాంతములోఁ జెప్పుచున్నారు.

యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్,
తద్వ త్సత్య మవిజ్ఞాయ జగ త్పశ్యతి మూఢధీః. ౯౫

తా. రజ్జువునువిడిచి భ్రమచేత సర్పమును గ్రహించునట్లు, మూఢబుద్ధికలవాఁడు సత్యము నెఱుంగనేరక జగతును జూచుచున్నాఁడు.

అవ. ప్రపంచ మెప్పుడు శూన్యమనియును మున్ను చెప్పిన ప్రారబ్ధము లేదనియును దృష్టాంతముతో నుపసంహరించు చున్నారు.

రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖణ్డం న తిష్ఠతి,
అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపఞ్చః శూన్యతాం గతః. ౯౬

తా. దారముయొక్క (వాస్తవ) స్వరూపమును జూచినప్పుడు సర్పమునిలుచుట లేదు. అట్లే అధిష్ఠానమును దెలిసికొనినప్పుడు ప్రపంచము శూన్యత్వమును బొందుచున్నది.

వి. ప్రపంచము లేనప్పుడు ప్రారబ్ధమును లేదని తెలియునది.

అవ. శ్రుతియందు ప్రారబ్ధము చెప్పఁబడినదానికి కారణ మిట్టిదని చెప్పుచున్నారు.

దేహస్యాఽపి ప్రపఞ్చత్వాత్ ప్రారబ్ధాఽవస్థితిః కుతః,
అజ్ఞానిజనబోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః. ౯౨

తా. శరీరమును ప్రపంచమగుటవలన ప్రారబ్ధస్థితి యెక్కడిది? అజ్ఞానులకు బోధించుటకొఱకు ప్రారబ్ధమును శ్రుతి చెప్పుచున్నది.

వి. "అత్ర బ్రహ్మసమశ్నుతే" ఇచ్చట బ్రహ్మమును చక్కఁగా ననుభవించు చున్నాఁడు. అను నీ మొదలగు శ్రుతులవలన ప్రారబ్ధము చెప్పఁబడినది.

అవ. ఇప్పుడు శ్రుతియందు ప్రారబ్ధము నిషేధింపఁబడినదానికి కారణమును చెప్పుచున్నారు.

క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే,
బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యా గీతంచ యత్ స్ఫుటమ్.

తా. అపరావరమును దెలిసికొనిన పిదప నీమనుష్యునియొక్క కర్మములు నశించుచున్నవని శ్రుతిచేత స్పష్టముగాఁ జెప్పఁబడిన బహుత్వమెద్దియో, అది దానిని (ప్రారబ్ధమును) నిషేధించునిమిత్తమే యగును.

వి. "భిద్యతే హృదయ గ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః, క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" "అపరావరమును (ప్రత్యగభిన్న పరబ్రహ్మమును) తెలిసికొనినంతనే హృదయగ్రంథులు వీడిపోవుచున్నవి. సకలసంశయములును నివృత్తి యగుచున్నవి. వీనికర్మములును క్షయించుచున్నవి" అని శ్రుతి. పరము=బ్రహ్మలోకాది పదములు, అపరము = దేని

యందు మగ్నమైనదిగా నున్నదో, అట్టి ప్రత్యగభిన్న పరబ్రహ్మము పరావర మనఁబడును.

అవ. మీఁదఁ జెప్పఁబడిన విపరీతమునందలి బాధకమును జెప్పుచున్నారు.

ఉచ్యతేఽజ్ఞైర్బలాచ్చైతత్ తదానర్థద్వయాగమః,
వేదాన్తమత హానం చ యతో, జ్ఞాన మితి శ్రుతిః. ౯౯

తా. అజ్ఞానులచేత ఇది (ప్రారబ్ధము) అవివేకసామర్థ్యమువలన సత్యముగాఁ జెప్పఁబడుచున్నది. అప్పుడుద్వివిధ దోషములు సంభవించు

టయును వేదాంతమతమునకు హానియును కలుగుచున్నవి. కావున, దేనిచేత జ్ఞానముక్తులునో, అట్టి శ్రుతినే గ్రహింపదగినది.

వి. ద్వివిధదోషము లనఁగా:—1. ప్రాగభ్యస్వరూపద్వైతమును అంగీకరించుటవలన మోక్షము లేకపోవునని ప్రసంగము సంభవించునది యొకదోషము. 2. మోక్షము లేకపోవుటవలన జ్ఞానసంప్రదాయమునకుహాని సంభవించునది రెండవదోషము.

“తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః, నానుధ్యాయా ద్బహూ౯ శబ్దా౯ వాచో విగ్లాపనం హి తత్” “బ్రహ్మమగుటకు కోరిక గల బ్రహ్మజ్ఞానియైన వివేకియొక్క ఉపదేశమువలనను శాస్త్రమువలనను ఆత్మ ను దెలిసికొనినపిమ్మట (అపరోక్షజ్ఞానానంతరము)ప్రజ్ఞ నుచేయుచున్నాఁడు. (కర్మోపాసనలను ప్రతిపాదించు) బహుశబ్దములను జింతింపఁగూడదు. అది

(ద్వైతశాస్త్రప్రపతనము) వాక్యానకు మిగులకష్టమే యగును. అని శ్రుతి.

అవ. ఇదినలకు ఉత్తమాధికారికి వైరాగ్యాది సాధనచతుష్టయపూర్వకమైన వేదాంతవాక్యవిచారముచేతనే ప్రత్యగభిన్న బ్రహ్మాపరోక్షజ్ఞానముద్వారా మోక్షము సిద్ధించునని చెప్పఁబడినది. ఇప్పుడు మందాధికారిచేయవలసినదానిని వచించుచున్నారు.

త్రిపఞ్చాఙ్గాన్యథో వక్ష్యే పూర్వోక్తస్య హి లబ్ధయే,
తైశ్చ సర్వైః సదా కార్యం నిదిధ్యాసనమేవతు. ౧౦౦

తా. ఇఁక పదునైదంగములను జెప్పెదను. ఆ యంగము లన్నిటి

చేతను మున్ను జెప్పఁబడిన దానిని (ఆత్మజ్ఞానమును) పొందు నిమిత్తము సదా నిధిధ్యాసనమే చేయఁదగినది.

అ. మందాధికారికూడ సకలసాధనములను త్యజించి శ్రద్ధతో నిర్గుణబ్రహ్మోపాసనమునే చేయవలయు నని బోధించుచున్నారు.

నిత్యాభ్యాసాదృతే ప్రాప్తి ర్నభవే త్సచ్చిదాత్మనః
తస్మా ద్బ్రహ్మ నిదిధ్యాసే ᳚ జ్జిజ్ఞాసుః శ్రేయసే చిరమ్.

తా. నిత్యాభ్యాసములేక సచ్చిదానందమైన ఆత్మను పొందుటకుఁ గాదు. కావున, జిజ్ఞాసువు శ్రేయస్సు (మోక్షము) కొఱకు ప్రతిదినమును బ్రహ్మమును నిదిధ్యాసనము చేయవలయును.

అవ. నిదిధ్యాసనము చేయుటకొఱకు తదంగములను రెండు శ్లోకములచేత వివరించుచున్నారు.

యమో హి నియమ స్త్యాగో మౌనం దేశశ్చ కాలతా,
ఆసనం మూలబన్ధ శ్చ దేహసామ్యం చ దృక్ స్థితిః. ౧౦౨
ప్రాణసంయమనం చైవ ప్రత్యాహార శ్చ ధారణా,
ఆత్మధ్యానం సమాధి శ్చ ప్రోక్తా న్యఙ్గాని వై క్రమాత్.

తా. 1 యమము, 2 నియమము, 3 త్యాగము, 4 మౌనము, 5 దేశము, 6 కాలము, 7 ఆసనము, 8 మూలబంధము, 9 దేహసమత్వము, 10 దృష్టి స్థితి, 11 ప్రాణాయామము, 12 ప్రత్యాహారము, 13 ధారణము, 14 ఆత్మ ధ్యానము, 15 సమాధి. అని అంగములు క్రమముగా చెప్పఁబడినవి.

అవ. యమముయొక్క లక్షణమును వచించుచున్నారు.

సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దిన్ద్రి యగ్రామసంయమః,
యమోఽయ మితిసంప్రోక్తోఽభ్యసనీయో ముహుర్ముహుః.

తా. సమస్తమును బ్రహ్మ మనెడి విజ్ఞానమువలన, ఇంద్రియ సమూహ మును నిరోధించుట యమ మనఁబడును. ఇది మాటిమాటికి అభ్యసింపఁ దగినది.

అవ. నియమముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.

సజాతీయప్రవాహ శ్చ విజాతీయ తిరస్కృతిః,
నియమో హి పరానన్దో నియమా త్క్రియతే బుధైః.౧౦౫

తా. సజాతీయ ప్రవాహమును, విజాతీయ తిరస్కారమును నియమ

మనఁబడును. నియమమువలన వివేకులచేత పరమానందము చేయఁ (అనుభవింపఁ) బడుచున్నది.

వి. ఏకజాతీయ మైన ఆత్మాకారవృత్తి యొక్క ప్రారంభమును, భిన్నజాతీయమైన అనాత్మాకారవృత్తినిగ్రహమును నియమ మనఁ బడును.

అవ. త్యాగలక్షణమును జెప్పుచున్నారు.

త్యాగః ప్రపఞ్చరూపస్య చిదాత్మత్వావలోకనాత్,
త్యాగో హిమహతాంపూజ్యః సద్యోమోక్షమయోయతః.

తా. చిదాత్మస్థితియొక్క అనుసంధానమువలన ప్రపంచస్వరూప

మును త్యజించుట యెదియో అది త్యాగ మనఁబడును. అది అనుసంధానకాలమునందే మోక్షమయమగుటచేత యోగులచేత పూజింపఁబడునదియై యున్నది.

అవ. మౌనమును, తద్భేదమును మూఁడు శ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

యస్మా ద్వాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ,
య న్మౌనం యోగిభి ర్గమ్యం తద్భవే త్సర్వదా బుధః.
వాచో యస్మా న్నివర్తన్తే తద్వక్తుం కేన శక్యతే,
ప్రపఞ్చో యది వక్తవ్యః సోపి శబ్దవివర్జితః. ౧౦౭
ఇది వా తద్భవే న్మౌనం సతాం సహజసంజ్ఞితమ్.

గిరామౌనంతు బాలనాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః. ౧౦౯

తా: దేనియందుండి వాక్కు మనస్సుతోఁ జేరక మరలుచున్నదో, ఏమౌనము యోగులచేత పొందఁబడునదియో, అట్లు సదా వివేకి కావలయును. (అనఁగా అట్టి బ్రహ్మముగా కావలయును.) అనునదియును; మఱియు వాక్కు దేనినుండి నివృత్తియగుచున్నదో, దానిని చెప్పుటకు ఎవరిచేత సాధ్యమగును? ప్రపంచము చెప్పఁబడునేని అదియును శబ్దములేనిదై యున్నది అనునదియును; బ్రహ్మజ్ఞానులయందు ప్రసిద్ధమైన మౌనముగ నున్నది. వాఙ్మౌనము బాలురకొఱ కని బ్రహ్మవాదులచేత చెప్పఁబడుచున్నది.

వి. శబ్దప్రవృత్తినిమిత్తములేనందున బ్రహ్మము వాక్కునకు విషయము

కాని యట్లు, నామరూపజాత్యాది ప్రపంచమును సత్తనిగాని, లేక, అసత్తని
నిగాని చెప్పుటకు సాధ్యము కానందున వాగతీత మనఁబడెను. ఈ చెప్పఁ
బడిన మానము పదునాలుగవ అంగమైన ఆత్మధ్యానముగాఁ దోఁచు ననెడి
శంక కలుగునని తలంచి వాఙ్మానమును చెప్పఁబడెను. ఇచట ప్రసిద్ధమైన
బ్రహ్మరూపమానమే గ్రహించునది.

అవ. దేశలక్షణమును నక్కాణించుచున్నారు

ఆదావన్తే చ మధ్యే చ జనో యస్మిన్న విద్యతే,
యేనేదం సతతం వ్యాప్తం స దేశో విజనః స్మృతః. ౧౧౦

తా. ఆదియందును, అంతమునందును, మధ్యయందును, దేనియందు
జను లుండుటలేదో, దేనిచేత నిది (ప్రపంచము) సర్వదా, వ్యాపింపఁబడి
యున్నదో, ఆదేశము నిర్జనప్రదేశము అనఁబడును.

వి. "త్రివిధ పరిచ్ఛేద శూన్యత్వం అఖణ్డత్వమ్" దేశము, కాలము, వస్తువు అను నీ త్రివిధపరిచ్ఛేదరహితమైనది పరబ్రహ్మము. దేశపరిచ్ఛేద మనఁగా, ఘటత్వాది ధర్మము పటత్వాదులందు లేదు, అను నీ మొదలగునవి.

అవ. కాలముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.

కలనా త్సర్వభూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః.
కాలశబ్దేన నిర్దిష్టో హ్యఖణ్డానన్ద అద్వయః. ౧౧౧

తా. బ్రహ్మాదులయొక్క నిమిషము మొదలు సకలభూతములయొక్కయు సృష్టిస్థితిలయముల కాధారముగా నుండుటవలన, అఖండానందాద్వయము (పరబ్రహ్మము) కాలశబ్దముచేత చెప్పఁబడుచున్నది.

వి. కాలపరిచ్ఛేదమనఁగా ' ఘటము తనయుత్పత్తికి పూర్వము తన ఉపాదాన కారణమైన కపాలమందు లేదు, అను నీమొదలగునవి.

అవ. ఆసనలక్షణమును జెప్పుచున్నారు.

సుఖేనైవ భవేద్యస్మిన్నజస్రం బ్రహ్మచింతనమ్,
ఆసనం తద్విజానీయా న్నేతర త్సుఖనాశనమ్. ౧౧౨

తా. ఏసుఖస్వరూప బ్రహ్మమునందు కర్తవ్యాకర్తవ్య చింతనము కలుగదో, అదియే నిత్యబ్రహ్మాసనమని యెఱుంగఁదగినది. తక్కినవి సుఖాసనము కాదు. సుఖమును నాశము చేయునవి యగును.

వి. ఈతాత్పర్యము శ్రీవిద్యారణ్యస్వాముల వారివ్యాఖ్యానప్రకారమని తెలియునది. సామాన్యముగా దీనియొక్క తాత్పర్యమెట్లనఁగా :—

దేనియందు నిరంతరబ్రహ్మచింతనము సుఖముగనే కలుగునో, అదియే తగినట్టి ఆసనమని తెలియఁదగినది. తక్కినవి సుఖమును చెడుపునట్టివి; ఆసనము కాదు.

అవ. ఇపుడు ఆసనవిశేషమును జెప్పుచున్నారు.

సిద్ధం య త్సర్వభూతాది విశ్వాధిష్ఠాన మవ్యయమ్,
యస్మి న్సిద్ధాః సమావిష్టా స్తద్వై సిద్ధాసనం విదుః. ౧౧౩

తా. ఏయ్యది సకలభూతాదిజగమునకును అధిష్ఠానమైన అవ్యయమో, అది సిద్ధ మనఁబడును, మఱియు దేనియందు సిద్ధులు (యోగసిద్ధిని పొందినవారు) చక్కఁగా నుందురో, అది సిద్ధాసన మని యెఱుంగునది.

వి. ఈసిద్ధాసనము రాజయోగ సంప్రదాయ మని యెఱుంగునది.

అవ. మూలబంధ లక్షణమును జెప్పుచున్నారు

యన్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్తబన్ధనమ్,
మూలబన్ధః సదా సేవ్యో యోగ్యోఽసౌ రాజయోగినామ్,

తా. ఏది సకలభూతములకును మూల(కారణ)మో, చిత్తముయొక్క బంధనము (నిరోధము) దేనికి కారణమో, అది (బ్రహ్మము) అని సేవింపఁదగిన మూలబంధ మగును. ఇది రాజయోగులకుఁ దగినదిగా నున్నది.

అవ. దేహసమత్వముయొక్క లక్షణమును జెప్పుచున్నారు.

అఙ్గానాం సమతాం విద్యాత్సమే బ్రహ్మణి లీయతే;
నోచే న్నైవ సమానత్వం ఋజుత్వం శుష్కవృక్షవత్.

తా. అంగములయొక్క సమత్వమును దెలిసికొనుటవలన, అంగముల యొక్క విషమత్వము సమత్వమైన బ్రహ్మమునందు లయ మొందును. ఎప్పుడు సమమైన బ్రహ్మాకారముగా నిలువలేదో), లయము కాదో, అపుడు ఎండిన మ్రాఁకువలె అంగములయొక్క సరళత్వము (చక్కఁగా నిల్చుట) సమానత్వము కాదు. (అనఁగా దేహసమత్వము కాదని భావము).

వి. సమత్వమనఁగా—బ్రహ్మమునందు అధ్యస్తమైన స్వభావవిషయములైన అంగములయొక్క అధిష్ఠాన సమత్వదృష్టి యని భావము.

అవ. దృష్టియొక్క లక్షణమును జెప్పుచున్నారు.

దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యే ద్బ్రహ్మమయం జగత్,

సా దృష్టిః పరమోదారా ననాసాగ్రావలోకినీ. ౧౧౬

తా. దృష్టిని (అంతఃకరణవృత్తిని) జ్ఞానముగాఁ (అఖండబ్రహ్మాకార వృత్తిగాఁ) జేసి, జగత్తును బ్రహ్మముగాఁ జూడవలయును. అదియే పరమోదారమైన దృష్టియగును. నాసికాగ్రమును వీక్షించుట దృష్టికాదు.

అవ. పైఁ జెప్పిన విధముగాఁ బ్రపంచమును బ్రహ్మస్వరూపముగాఁ జూచుట కెట్లు సాధ్య మగుననియాశంకించువారికి సమాధానము చెప్పుచున్నారు.

ద్రష్టృదర్శన దృశ్యానాం విరామో యత్ర వా భవేత్,
దృష్టి స్తత్రైవ కర్తవ్యా న నాసాగ్రావలోకినీ. ౧౧౭

తా. మఱియు చూచువాఁడు, చూచుట, చూడఁబడువస్తువు, అను

వానియొక్క (త్రిపుటియొక్క) లయ మెచ్చట కలుగుచున్నదో, అచ్చట దృష్టిని (అంతఃకరణవృత్తిని) నిలుపవలసినది. నాసికాగ్రమును వీక్షించుట దృష్టి కాదు.

వి. ఇచ్చట చూచువాఁడు (ద్రష్ట) మొదలగునవి వినువాఁడు మొదలగు సకల త్రిపుటులకును ఉపలక్షణము

అవ. ప్రాణాయామలక్షణమును, తద్భేదమును, మూఁడు శ్లోకముల చేతఁ జెప్పుచున్నారు.

చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్,
నిరోధః సర్వవృత్తీనాం ప్రాణాయామః స ఉచ్యతే. ౧౧౮

తా. చిత్తము మొదలగు సకలభావముల (స్థితుల) యందును బ్రహ్మత్వముగనే భావించుట వలన సకలవృత్తులను నిరోధించుట యేదియో, అది ప్రాణాయామ మనఁబడును.

వి. ప్రాణము చిత్తమునకు వశవర్తిగా నుండుటవలన చిత్తనిరోధముచేతనే ప్రాణనిరోధము కలుగును. ఈయభిప్రాయమే ఇచ్చటఁ జెప్పఁబడినది.

నిషేధనం ప్రపఞ్చస్య రేచకాఖ్యః సమీరణః,
బ్రహ్మైవాస్మీతి యా వృత్తిః పూరకో వాయు రీరితః. ౧౧౯

తా. ప్రపంచమును నిషేధించుట రేచక మనెడి ప్రాణాయామ మనఁబడును. బ్రహ్మమే నేననెడి వృత్తి యేదియో అది పూరక ప్రాణాయామ మనఁబడును.

తతః సద్వృత్తి నైశ్చల్యం కుమ్భకం ప్రాణసంయమః,
అయం చాపి ప్రబుద్ధానా మజ్ఞానాం ఘ్రాణపీడనమ్. ౧౨౦

తా. పిమ్మట, ఆవృత్తియొక్క (బ్రహ్మమే నే ననెడి వృత్తియొక్క) నిశ్చలత్వము కుంభకప్రాణాయామ మనఁబడును. ఇది వివేకుల కగును. ముక్కును పీడించుట అజ్ఞానులకు తగినది.

అవ. ప్రత్యాహార లక్షణమును వచించుచున్నారు.

విషయే ష్వాత్మతాం దృష్ట్వా మనసశ్చిత్తమజ్జనమ్,
ప్రత్యాహారః స విజ్ఞేయో ఽభ్యసనీయో ముముక్షుభిః.

తా. విషయములయందు (ఘటాదులయందును, లేక, శబ్దాదులయందును వ్యతిరేకస్థితిచేత) ఆత్మస్థితి నెఱిఁగి మనస్సు చిత్తునందు మగ్నమగుట ప్రత్యాహార మని తెలియఁదగినది. అది ముముక్షువులచేత నభ్యసింపఁదగినది.

౨. నామరూప క్రియాదులను అనుభవింపక చిత్స్వరూపముగా నుండుటయెదియో అదియే చిత్తునందు మనస్సు లయమగుట (లేక, మగ్న మగుట) యని తేలియున్నది.

౮౭. ధారణా లక్షణమును జెప్పుచున్నారు.

యత్ర యత్ర మనో యాతి బ్రహ్మణ స్తత్ర దర్శనాత్,
మనసో ధారణం చైవ ధారణా సా పరా మతా. ౧౨౨

తా. ఎచ్చ టెచ్చట మనస్సు పోవుచున్నదో, అచ్చ టచ్చట బ్రహ్మ మును దర్శించుటవలన మనస్సును ధరించుట (మనస్సునందు బ్రహ్మమును నెల కొల్పుట) యెదియో అది శ్రేష్ఠమైన ధారణ యని తలంపఁబడుచున్నది.

వి. ఇచ్చటఁ జెప్పఁబడిన ధారణాలక్షణము షడాధారములలో నొక్కదానికి సంబంధించినది గాదు. ఇది కేవల తత్త్వవేత్త లనుష్ఠించు ధారణ యని యెఱుంగునది.

అవ. ఆత్మధ్యానలక్షణమును జెప్పుచున్నారు.

బ్రహ్మైవాస్మీతి సద్వృత్త్యా నిరాలమ్బతయా స్థితిః,
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానన్దదాయినీ.

తా. బ్రహ్మమే నేననెడిసద్వృత్తిచేత (ఇతరప్రమాణములచే బాధింపఁబడని వృత్తిచేత; నిరాలంబత్వముగా (దేహాద్యనుసంధానము లేనిస్థితిగా) నుండుటయేదియో, అది పరమానందము నొసంగునది యని ధ్యాన (ఆత్మధ్యాన) శబ్దముచేతఁ జెప్పఁబడుచున్నది.

అవ. సమాధిలక్షణమును జెప్పుచున్నారు.

నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః,
స్మృతివిస్మరణం సమ్యక్ సమాధి ర్జ్ఞానసంజ్ఞకః. ౧౨౪

తా. నిర్వికారత్వవృత్తి (విషయానుసంధానములేని అంతఃకరణవృత్తి) చేత మరల బ్రహ్మాకారత్వముఁగా చక్కఁగా (ప్రపంచసంస్కారములేక)

ధ్యేయాకారవృత్తి శూన్యముగా నుండుట (ద్వైతానుసంధానము లేకుండుట) యెదియో, అది జ్ఞానమనెడి సమాధి యగును.

వి. "సమాధిః సంవి దుత్పత్తిః పరజీవైక్యతాం ప్రతి" "పరజీవైక్యమును (జీవేశ్వరైక్యమును) గూర్చి జ్ఞానము కలుగుటయే సమాధి యనఁబడును." అని చెప్పఁబడి యున్నది.

అవ. నిదిధ్యాసనాభ్యాసకాలముయొక్క అవధిని జెప్పుచున్నారు.

ఇమం చాకృత్రి మానన్దం తావ త్సాధుః సమభ్యసేత్,

తా. ఈ స్వస్వరూపానందమును ప్రకాశింపఁజేయు నిదిధ్యాసనమును ఏషణము దాఁక పురుషుఁడు లక్ష్యమునం దుంచినవాఁడై తానే పశ్యుఁడగునో (తన్మయత్వమును బొందినవాఁడగునో) అంతవఱకును జక్కఁగా నభ్యసింప వలయును.

వి. చకారమువలన బుద్ధికిఁదగిన వేదాన్తవిచారముగూడ గ్రహింపఁదగును.

అవ. ఇట్లు అభ్యసింపఁబడిన నిది ధ్యాసనమువలని ఫలమును జెప్పుచున్నారు.

తత స్సాధన నిర్ముక్తః సిద్ధో భవతి యోగిరాట్,
తత్ స్వరూపం న చైతన్య విషయో మనసో గిరామ్.౧౨౮

తా. అనంతరము సాధనములేనివాఁడై యోగీశ్వరుఁడు సిద్ధుఁడగుచున్నాఁడు. ఈయోగికి ఆదియే (వేదాంతప్రసిద్ధబ్రహ్మమే) స్వరూపమగును. వీనియొక్క మనస్సునకును వాక్కునకును (ఏదియును) విషయమగుటలేదు.

వి. తన్నుఁదానే ధ్యానింపఁదగినదైనదిగాని ధ్యానింపఁదగినదేమియు లేదని భావము.

అవ. ఈసమాధి పర్యంతమైన యోగము సులభమని భావించి అనాదరము చేయఁదగదని రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నారు.

అనుసన్ధానరాహిత్య మాలస్యం భోగలాలసమ్. ౧-౨౭
లయ స్తమ శ్చ విక్షేపో రసాస్వాదః శ్చ శూన్యతా,
ఏవం యద్విఘ్న బాహుళ్యం త్యాజ్యం బ్రహ్మవిదాశనైః.

తా. సమాధిని అభ్యసించునపుడు విఘ్నములు తనంతట వచ్చును. అనుసంధానము లేకుండుట, ఆలస్యము, భోగేచ్ఛ, లయము (నిద్ర), తమస్సు (కార్యాకార్య అవివేకము), విక్షేపము (విషయగోచరము), రసాస్వాదము (నేను ధన్యుఁడ ననెడి ఆనందాది వృత్తులు), శూన్యత్వము (కషాయము, అనఁగా రాగద్వేషాది తీవ్రవాసనలచేత చిత్తము స్తంభించి యుండుట), ఇట్లు సంభవించు విఘ్నబాహుళ్యమును బ్రహ్మవేత్తలు మెల్లగా త్యజింపవలయును.

౨. ఈవిషయమును విస్తరముగా పాతంజలయోగశాస్త్రము యోగపాదము 30 వ సూత్రమునందుఁ గనందగును.

అవ. వృత్తిరయే బంధమోక్ష కారణ మని చెప్పుచున్నారు.

భావవృత్త్యాహి భావత్వం శూన్యవృత్త్యాహి శూన్యతా,
బ్రహ్మవృత్త్యా హి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్.

తా. భావవృత్తిచేత భావత్వమును, అభావ (శూన్య) వృత్తిచేత అభావత్వ (జడత్వ) మును కల్గుట లోకప్రసిద్ధము. అట్లే బ్రహ్మవృత్తిచేత పూర్ణత్వము కలుగుట జ్ఞానులయందు ప్రసిద్ధము. కావున పూర్ణత్వమును అభ్యసింపవలయును.

వి. భావవృత్తి యనఁగా, ఘటాద్యాకారవృత్తి యనియును; భావత్వమనఁగా తన్మయత్వ మనియును భావము.

అవ. బ్రహ్మవృత్తి శ్రేష్ఠమనియును, దానిని విడలిన మనుజులు మూఢు లనియును జెప్పుచున్నారు.

యే హి వృత్తిం విహాయైనాం బ్రహ్మాఖ్యాంపావనీంపరామ్,
వృథైవ తే తు జీవన్తి పశుభిశ్చ సమా నరాః. ౧౩౦

తా. ఎవరు ఈశ్రేష్ఠమును పరిశుద్ధము నైన బ్రహ్మవృత్తిని త్యజించెదరో, ఆపశువులకు సమాను లైన మనుష్యులు వ్యర్థముగా జీవించుచున్నారు.

వి. బ్రహ్మవృత్తియే సకలవృత్తులకంటెను ఉత్తమమనియు, దానిని విడియనివాఁడు నరపశు వనియును భావము.

అవ. బ్రహ్మవృత్తియొక్క మహిమను నటించుచున్నారు.

యే హి వృత్తిం విజానన్తి జ్ఞాత్వా సంవర్ధయన్తి యే,
తే వై సత్పురుషా ధన్యా వన్ద్యాస్తే భువనత్రయే. ౧౩౧

తా. ఎవ్వరు ఈవృత్తిని (బ్రహ్మవృత్తిని) తెలియుచున్నారో, ఎవరు ఈవృత్తిని తెలిసికొని వృద్ధి చేయుచున్నారో, వారే సత్పురుషులు, త్రిలోకములయందు పూజింపఁబడువారు.

అవ. బ్రహ్మవృత్తి మహిమ కారణమును జెప్పుచున్నారు.

యేషాం వృత్తిః సమా వృద్ధా పరిపక్వా చ సా పునః,

తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మవాదినః. ౧౩౨

తా. ఎవరివృత్తి సమముగను, వృద్ధిపొందినదిగను, పరిపక్వమైనదిగనున్నదో, వారే సత్తయిన బ్రహ్మమును బొందినవారు. శబ్దవాదులైన యితరులు పొందినవారు కారు.

అవ. శబ్దబ్రహ్మవాదులను రెండుశ్లోకములచేత నిందించుచున్నారు.

కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాః సురాగిణః,
తే ప్యజ్ఞానతమా నూనం పునరాయాన్తి యాన్తి చ. ౧౩౩

తా. బ్రహ్మమునుగూర్చి మాటలాడుటయందు సమర్థులుగను, మంచి రాగము (పట్టుదల) గలవారుగను నుండువారెవరో, వారు నిశ్చయముగా అజ్ఞానులుగా వచ్చుచున్నారు పోవుచున్నారు.

వి. బ్రహ్మమును పొందక (తన్మయత్వము నొందక) బ్రహ్మమును శూర్చిమాత్రము పలుకుచుండువారు అజ్ఞానులుగా పుట్టుచు చచ్చుచు నుందు రేకాని మోక్షము నొంద రని భావము.

నిమేషార్థం న తిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయం వినా,
యథా తిష్ఠన్తి బ్రహ్మాద్యాః సనకాద్యాః శుకాదయః. ౧౩౪

తా. బ్రహ్మాది దేవతలును, సనకాదిమునులును, శుకాదియోగులును ఉండునట్లుగా (మేముకూడ) బ్రహ్మమయమైన వృత్తిలేక అరనిముసమును ఉండలేము

వి. మీఁదఁజెప్పిన వారివలె, తాముకూడ నిరంతరమును బ్రహ్మా కారవృత్తియందే యున్నారమని శబ్దవాదులు చెప్పుచుందురని యభిప్రాయము.

అవ. ఇట్లు శ్రుతిసమ్మతమైన రాజయోగలక్షణమును వచించి, మున్ను ఉపక్రమించిన సాంఖ్య వేదాంతవిచారమును అయిదుశ్లోకముల చేతఁ జెప్పుచున్నారు.

కార్యే కారణతా యాతా కారణే న హి కార్యతా,
కారణత్వం తతో నశ్యేత్ కార్యాభావే విచారతః. ౧౩౫

తా. కార్యమునందు (ఘటాదిస్వరూప వికారమునందు) కారణత్వము (మృత్తికాదిస్వరూప సర్వవికారాధిష్ఠానత్వము) వచ్చుచున్నది; కార

ణమునందు కార్యత్వము వచ్చుటలేదు. కాఁబట్టి, విచారముచేత కార్యత్వము లేనియట్లే కారణత్వమును లేక పోవుచున్నది.

వి. ఈదృష్టాంతము వలె దార్ష్టాంతికమునందును సత్య జ్ఞానానందాదిస్వరూపబ్రహ్మమునకు కారణత్వము సంభవించుచున్నది. బ్రహ్మమునందు ఆకాశాదికార్యత్వము లేదు. కనుక పరమార్థముగా ఆకాశాదులు లేనియట్లే బ్రహ్మమునకు కారణత్వమును లేదని భావము.

అథ శుద్ధం భవే ద్వస్తు యద్వై వాచామగోచరమ్,
ద్రష్టవ్యం మృద్ఘటేనైవ దృష్టాంతేన పునః పునః.

తా. తర్వాత (కార్యకారణత్వనివృత్తి కాలమునందు వాక్యాన కందరాని శుద్ధవస్తువెద్దియో అది యగుచున్నాడు. మట్టియొక్కయు కుండయొక్కయు దృష్టాంతముచేత (భేదము కనఁబడనియట్లు) మాటిమాటికి చూడవలయును.

అనేనైవ ప్రకారేణ వృత్తి ర్బ్రహ్మాత్మికా భవేత్,
ఉదేతి శుద్ధ చిత్తానాం వృత్తి జ్ఞానం తతః పరమ్. ౧౩౭

తా. ఈప్రకారముచేత (విచారముచేత) వృత్తి బ్రహ్మస్వరూపమగుచున్నది. అనంతరము శుద్ధచిత్తము గలవారలకు బ్రహ్మాకారవృత్తిజ్ఞానము కలుగుచున్నది.

వి. ఈవిచారము జ్ఞానసాధనముమాత్రమేగాక ధ్యానసాధనము నైయున్నదని తెలియునది.

కారణం వ్యతిరేకేణ పుమా నాదౌ విలోకయేత్,
అన్వయేన పున స్తద్ధి కార్యే నిత్యం ప్రపశ్యతి. ౧౩౭

తా. పురుషుఁడు మొదట కారణమును వ్యతిరేకముగా (కార్యము లేనిదానినిగా) విచారింపవలయును మరల ఆకారణమును అన్వయముచేత కార్యమునందును నిత్యముగా జూచుచున్నాఁడు.

కార్యే హి కారణం పశ్యేత్ పశ్చా త్కార్యం విసర్జయేత్,
కారణత్వం తతో గచ్ఛే దవశిష్టం భవే న్మునిః. ౧౩౮

తా. మఱియు మొదట కార్యమునందు కారణమును జూడవల

యును. పిమ్మట కార్యమును త్యజింపవలయును. అందువలన (కార్యమును త్యజించినందువలన) కారణత్వము తనంతట పోవుచున్నది. పోఁగా ముని (మననశీలుఁడు) శేషించినవాఁడగుచున్నాఁడు.

అవ. విచారమువలనఁ గల్గిన అపరోక్షజ్ఞానమువలన మననశీలునకు బ్రహ్మత్వము గలుగుట సహజమేయైనను, పరోక్షజ్ఞానమువలనను బ్రహ్మత్వసిద్ధి కల్గునని చెప్పుచున్నారు.

భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా,
పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్. ౧౪౦

తా. నిశ్చయబుద్ధి గలవానిచేత ఏవస్తువు తీవ్రవేగముచేత (శేయుంబవల్ల) భావింపఁబడుచున్నదో, ఆజ్ఞేయవస్తువుగా (అపరోక్షముగాఁ దెలియఁదగిన బ్రహ్మముగా) భ్రమరకీటమువలె అగుచున్నాఁడు.

వి. పరోక్షజ్ఞానముచేత ప్రమాతయందు ఆవరణము నివృత్తియైనను ప్రమేయమునందలి ఆవరణము నివృత్తి యగుటలేదు. అయినను ఎడతెగని అభ్యాసబలముచేత (భ్రమరకీటన్యాయమువలె) బ్రహ్మత్వము కలుగుచున్న దని తెలియఁ దగినది. ఈవిషయము విచారసాగరమునందు విస్తరముగాఁ గనఁదగును.

అవ. కావున వివేకి నిరంతరమును సర్వాత్మభావననే చేయవలయు నని చెప్పుచున్నారు.

అదృశ్యం భావరూపం చ సర్వమేవ చిదాత్మకమ్,

సావధానతయా నిత్యం స్వాత్మానం భావయేద్బుధః. ౧౮౧

తా. అదృశ్యమును (పరోక్షమును), భావరూపమును (ప్రత్యక్షమును), అయిన సమస్తమును చిత్స్వరూపమే. విద్వాంసుఁడు సావధానముగా నిరంతరమును తనయొక్క ఆత్మనే భావింపఁ దగినది.

అవ. స్వాత్మభావనయొక్క విశేషమును వచించుచున్నారు.

దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చిన్తయేత్,
విద్వాన్ నిత్యసుఖేతిష్ఠేత్ ధియాచిద్రసపూర్ణయా. ౧౮౨

తా. దృశ్యత్వమును అదృశ్యత్వమును త్యజించి బ్రహ్మాకారముగా (అపరిచ్ఛిన్నముగా) చింతింపవలయును. అందువలన విద్వాంసుఁడు జ్ఞానరసపూర్ణమైన బుద్ధితో నిత్యసుఖమునం దుండువాఁ డగును.

అవ. ఇపుడు గ్రంథకర్త తమకు సమ్మతమైన యోగమును చెప్పు చున్నారు.

ఏభి రఙ్గైః సమాయుక్తో రాజయోగ ఉదాహృతః,
కిఞ్చిత్పక్వకషాయాణాం హఠయోగేన సంయుతః. ౧౪౩

తా. ఈ(చెప్పఁబడిన) యంగములతోఁగూడినది రాజయోగ మనఁబడును. కొంచెము పక్వకషాయము గలవారికి హఠయోగముతోఁ గూడిన యంగము లభ్యసింపఁదగినది. ఇందుఁ జెప్పఁబడిన యంగములు వేదాంత గ్రంథములందుఁ జెప్పఁబడినవి.

వి. ఈగ్రంథమునందుఁ జెప్పఁబడిన లక్షణములెల్లను రాజయోగుల కొఱకనియును, అనఁగా పరిపక్వకషాయము కలవారి కనియును, కించిత్పక్వకషాయము కలవారికి హఠయోగమునందు చెప్పఁబడిన యంగములు అభ్యసింపఁబడ వలయుననియును తెలియునది. అనఁగా రాజయోగము సిద్ధించుటకై హఠయోగమును అభ్యసింపవలయునని భావము. (కషాయాదులను విచారసాగరమునందుఁ గనందగును.)

అవ. ఈరాజయోగము పరిపక్వచిత్తము గలవారికిని, గురుదేవతా భక్తిగల సకల మైనవారికిని సిద్ధించు నని చెప్పుచున్నారు.

పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః,
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్. ౧౭౮

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తా. పరిపక్వ హృదయము కలవారికి కేవలము ఈ రాజయోగము మోక్షసిద్ధి నొసంగును. అట్లే గురువునందును దైవమునందును భక్తిగల సకల జనులకును సులభముగను శీఘ్రముగను (ఈ రాజయోగము) సిద్ధించును.

వి. గురువునందును దైవమునందును భక్తిగలిగి యుండవలయు ననునది అంతరంగసాధన మనఁబడును. శ్వేతాశ్వతరశ్రుతియందు—"యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ, తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః." ఎవనికి దైవమునందలి విశేషభక్తియును దైవమునందువలె గురువునందు విశేషభక్తియు నుండునో ఆమహాత్మునకే ఈః చెప్పఁబడిన యర్థములు ప్రకాశించును; అని చెప్పఁబడి యున్నది భగవద్గీతయందు—

"...ద్విద్ధి ప్రణిపాతేన" "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" [illegible] (భగవంతునియందు భక్తికలవాఁడవై) తెలిసికొనుము. శ్రద్ధకలవాఁడు (గురువాక్యమునందు విశ్వాసముకలవాఁడు) జ్ఞానమును బొందుచున్నాఁడు. అనియును చెప్పఁబడియున్నది. సకలజనులకును అనుటవలన వర్ణాశ్రమధర్మాపేక్షలేకయే మనుష్యమాత్రుల కందఱకును సిద్ధించు ననుభావము.

## అపరోక్షానుభూతి

## స మా ప్త ము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1920.

## సంస్కృత గ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, సటీకము | ... | 0 | 3 |
| సుందరకాండము, మూలము, చిన్న సైజు | ... | 1 | 0 |
| సుందరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 12 |
| బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| (తక్కిన కాండములు ఆంధ్రతాత్పర్యముతో అచ్చగుచున్నవి.) | | | |
| శ్రీమద్రామాయణము, మూలము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| యజుర్వేద సంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు | | 0 | 4 |

| | | | |
|---|---|---|---|
| యజుర్వేద ఆబ్దికమంత్రములు, మూలము, చిన్నసైజు | ... | 0 | 6 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| వ్రతచూడామణి, 360 వ్రతములు, మంచిప్రతి | ... | 1 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములఁజేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానురూపముగఁ బరిష్కరింపించి ముద్రించియున్నాము | ... | 2 | 0 |
| మహాన్యాసము, చిన్నసైజు, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు, చిన్నసైజు | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీక, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము | ... | 0 | 4 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 2 |

## సంస్కృతగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 10 |
| వ్రతరత్నాకరము, ద్వితీయభాగము | ... | 1 | 2 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీకము, చిన్నసైజు | ... | 0 | 3 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవ ఆహ్నికము, చిన్నసైజు | ... | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ,, | ... | 0 | 4 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసయిజు | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసయిజు, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| రుద్రము, పురుషసూక్తము వగైరాలు. చిన్నసయిజు | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము | ... | 0 | 4 |
| సంధ్యావందనభాష్యము, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| హరిమీడేస్తోత్రము, సటీక | ... | 0 | 4 |

ఓం

నమో భగవతే దక్షిణామూర్తయే

# అథర్వణరూప అతివర్ణాశ్రమం.

ఇది

శ్రీమత్ శుకబ్రహ్మమహర్షి విరచిత నిర్వాణాష్టకమున్ను

శ్రీమత్ మాండూకమహర్షి విరచిత మాండూక్యోపనిషత్తున్ను

శ్రీమత్ దత్తాత్రేయమహర్షి విరచిత జీవన్ముక్తి స్వభావశీలలున్ను

ముముక్షు జనపారాయణోపయుక్తముగా

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ సిద్ధపరిపూర్ణానంద మహర్షి ప్రియశిష్యులగు

శ్రీ బ్రహ్మానంద యోగీశ్వర స్వామివారిచే ప్రచురింపబడినది.

చెన్నపురి.

ఓం

నమో భగవతే దక్షిణామూర్తయే

# అథర్వణరూప అతివర్ణాశ్రమం.

ఇది

శ్రీమత్ శుకబ్రహ్మమహర్షి విరచిత నిర్వాణాష్టకమున్ను

శ్రీమత్ మాండూకమహర్షి విరచిత మాండూక్యోపనిషత్తున్ను

శ్రీమత్ దత్తాత్రేయమహర్షి విరచిత జీవన్ముక్తి స్వరూపగీతలున్ను

ముముక్షు జనపారాయణోపయుక్తముగా

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ సిద్ధపరిపూర్ణానంద మహర్షి ప్రియశిష్యులగు

శ్రీబ్రహ్మానంద యోగీశ్వర స్వామివారిచే ప్రచురింపబడినది.

చెన్నపురి.

ఓం నమోభగవతే వ్యాసరూపాయ
ఓం నమోభగవతే శుకరూపాయ

# శ్రీనిర్వాణాష్టకం ప్రారంభః.



ధ్యానం॥ ఆనందసింధు మజమక్షర మద్వితీయ
మాత్మాన మచ్యుత శివం స్వగురుం ప్రణమ్య
కుర్వే సమస్త జననిర్వృతి సౌఖ్యసిద్ధ్యై
శ్రీమచ్ఛు కాష్టక సరోజ విబోధభానుం॥

1. భేదాభేదౌ సపదిగళితౌ పుణ్యపాపేవిశీర్ణే
మాయామోహౌ క్షయముపగతౌ నష్టసందేహవృత్తేః
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్యతత్త్వావబోధం
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

2. యద్వాత్మానం సకలవపుషా మేకమంతర్బహిస్థం
దృష్ట్వాపూర్ణం ఖమివసతతం సర్వభాండస్థమేకం
నాన్యత్కార్యం కిమపిచతతః కారణాద్భిన్నరూపం
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

3. హేమ్నః కార్యం హుతవహగతం హేమమేవేతియద్వత్
క్షీరేక్షీరం సమరసతయా తోయమేవాంబుమధ్యే
ఏవం సర్వం సమరసతయా త్వం పదం తత్పదార్థే
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

4. యస్మిన్విశ్వం సకలభువనం సామరస్యైకభూత
ముర్వీవహ్న్యో పోనలమనిలఖం జీవమేవంక్రమేణ
యత్సారాత్మా ఖ్యాసమరస తయాసైంధవైకత్వభూతం
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

5. యద్వన్నద్యో దధిసమరసా సాగరత్వంహ్యవాప్తా
తద్వజ్జీవా లయపరిగతా సామరస్యైకభూతాః

భేధాతీతం పరిలయగతం సచ్చిదానందరూపం
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

5. దృష్ట్వా వేద్యం పరమార్థపదం స్వాత్మబోధ స్వరూపం
బుద్ధ్వాత్మానం సకలవపుషామేక మంతర్బహిస్థం
భూత్వానిత్యం సదుదితతయా స్వప్రకాశ స్వరూపం
నిస్త్రైగుణ్యే పథివిచరతః కోవిధిః కోనిషేధః॥

. కార్యాకార్యే కిమపిసతతం నైవకర్తవ్యమస్తి
జీవన్ముక్త స్థితిమవగతో దగ్ధవస్త్రావభాసః

ఏవం దేవా ప్రవిలయగతే తిష్ఠమానే విముక్తే
నిస్త్రైగుణ్యే పథివిచరతః కో౽విధిః కో౽నిషేధః॥

8. కస్మాత్కో౽హం కిమపిచభవా న్కో౽యమత్రప్రపంచః
స్వంస్వం వేద్యం గగనసదృశం పూర్ణతత్వప్రకాశం
ఆనందాఖ్యే సమరసఘనే బాహ్యమంతర్విహీనే
నిస్త్రైగుణ్యే పథివిచరతః కో౽విధిః కో౽నిషేధః॥

9. సత్యంసత్యం పరమమమృతం సర్వకల్యాణరూపం
మాయారణ్యే దహనమమలం శాంతినిర్వాణదీపం
తేజోరూపం నిగమసదనం వ్యాసపుత్రాష్టకంయః
ప్రాతఃకాలే పఠతిమనసా యాతినిర్వాణమార్గే॥

ఇతి శ్రీశుకబ్రహ్మ విరచిత నిర్వాణాష్టకం సంపూర్ణం.

ఓం తత్సత్పరబ్రహ్మణేనమః.

# శ్రీ మాండూక్యోపనిషత్ ప్రారంభః.



అధర్వణవేద శాంతిమంత్రం.

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామదేవాః
భద్రంపశ్యే మాక్షభిర్యజత్రాః
స్థిరై రంగైస్తుష్టువాం సస్తనూభిః
వ్యశేమదేవహితం యదాయుః

స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినో బృహస్పతి ర్దధాతు॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

మంత్రం. 1. హరిః ఓం. ఓమిత్యే తదక్షరమిదం సర్వం తస్యోప వ్యాఖ్యాన భూతం భవద్భవిష్య దితి సర్వమోంకారఏవ। యచ్చాన్య త్త్రికాలా తీతం తదప్యోంకారఏవ॥

మంత్రం. 2. సర్వం హ్యేతద్బ్రహ్మాయమాత్మా బ్రహ్మసో౽యమాత్మా చతుష్పాత్॥

మంత్రం. 3. జాగరి తస్థానోబహిః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః స్థూలభుగ్వైశ్వానరః ప్రథమఃపాదః॥

మంత్రం. 4. స్వప్నస్థానో౽న్తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః ప్రవివిక్తభుక్ తైజసోద్వితీయః పాదః॥

మంత్రం. 5. యత్రసుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతితత్సుషుప్తం । సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞాన ఘనఏవా౽నంద మయోహ్యానంద భుక్చేతోముఖః ప్రాజ్ఞస్తృతీయఃపాదః॥

మంత్రం. 6. ఏష సర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషో౽న్తర్యామ్యేష
యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ హిభూతానాం॥

మంత్రం. 7. నాంతఃప్రజ్ఞం నబహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం
నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞమ్। అదృష్ట మవ్యవహార్యమగ్రాహ్య
మలక్షణ మచింత్యమవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశ
మం శాంతం శివమద్వైతంచతుర్థం మన్యంతే సఆత్మా సవిజ్ఞేయః॥

మంత్రం. 8. సో౽యమాత్మా౽ధ్యక్షరమోంకారో ౽ధిమా
త్రం పాదామాత్రా మాత్రాశ్చపాదా అకార ఉకారోమకారఇతి॥

మంత్రం. 9. జాగరిదస్థానో వైశ్వానరోఽకారః ప్రథమామా
త్రాప్తేరాది మత్వా ద్వాప్నోతిహవై సర్వాన్ కామానాదిశ్చ భవతి
యఏవం వేద॥

మంత్రం. 10. స్వప్నస్థానస్తైజస ఉకారోద్వితీయా మాత్రోత్క
ర్షాదు భయత్వాద్వోత్కర్షతి హవై జ్ఞానసంతతిం సమానశ్చభవతి
నాస్యాబ్రహ్మ విత్కులేభవతి యఏవం వేద॥

మంత్రం. 11. సుషుప్తస్థానః ప్రాజ్ఞోమకార స్తృతీయా
మాత్రా మితేరపీ తేర్వామినోతి హవా ఇదం సర్వమపీతిశ్చ భవతి
యఏవం వేద॥

 ... పశ

మఃశివో ఽద్వైతఏవ మోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం యఏవం వేద యఏవం వేద॥

## అధర్వణవేద శాంతిమంత్రం.

ఓం భద్రంకర్ణేభిః శ్రుణుయామదేవాః
భద్రంపశ్యే మాక్షభిర్యజత్రాః
స్థిరైరంగై స్తుష్టువాం స స్తనూభిః
వ్యశేమదేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినఃపూషా విశ్వవేదాః

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తినోబృహస్పతి ర్దధాతు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

ఇతి మాండూక్యోపనిషత్ సంపూర్ణః



నమోభగవతే దత్తాత్రేయాయ

# జీవన్ముక్తిగీతా ప్రారంభః.

---

ధ్యానం:—అణోరణీయసే సాక్షాన్మహతశ్చ మహీయసే।
ఆదిమధ్యాంత హీనాయ మహ్యమేవ నమోనమః॥

1. జీవన్ముక్తిశ్చ యాముక్తిః సాముక్తిః పిండపాతనే
యాముక్తిః పిండపాతేన సాముక్తిః శునిశూకరే॥

2. జీవశ్శివః సర్వమేవభూతేష్వేవం వ్యవస్థితః
ఏవమేవాభిపశ్యంహి జీవన్ముక్తః స ఉచ్యతే॥

3. ఏవంబ్రహ్మజగత్సర్వ మఖిలంభాస తేరవిః
సంస్థితంసర్వభూతానాం జీవన్ముక్తఃసఉచ్యతే॥

4. ఏకధాబహుధాచైవ దృశ్యతేజలచంద్రవత్
ఆత్మజ్ఞానీతథైవైకో జీవన్ముక్తఃసఉచ్యతే॥

5. సర్వభూతేస్థితంబ్రహ్మ భేదాభేదోనవిద్యతే
ఏకమేవాభిపశ్యంశ్చ జీవన్ముక్తః సఉచ్యతే॥

6. తత్వంక్షేత్రం వ్యోమాతీత మహంక్షేత్రజ్ఞ ఉచ్యతే
అహంకర్తానభోక్తాచ జీవన్ముక్తః సఉచ్యతే॥

7. [illegible]
ఆత్మజ్ఞానీ తథైవైకో జీవన్ముక్తః సఉచ్యతే॥

8. శారీరం కేవలంకర్మ శోకమోహాదివర్జితం
శుభాశుభపరిత్యాగీ జీవన్ముక్తః సఉచ్యతే॥

9. కర్మసర్వత్ర ఆధిష్టం నజానామిచకించన
కర్మబ్రహ్మ విజానాతి జీవన్ముక్తః సఉచ్యతే॥

10. చిన్మయంవ్యాపితంసర్వ మాకాశంజగదీశ్వరం
సహితం సర్వభూతానాం జీవన్ముక్తః సఉచ్యతే॥

11. అనాదివర్తిభూతానాం జీవఃశివోనహన్యతే
నిర్వైరఃసర్వభూతేషు జీవన్ముక్తః సఉచ్యతే॥

12. ఆత్మాగురుస్త్వంవిశ్వంచ చిదాకాశోనలిప్యతే
గతాగతంద్వయోర్నాస్తి జీవన్ముక్తః సఉచ్యతే॥

13. గర్భధ్యానేనపశ్యంతి జ్ఞానినాంమనఉచ్యతే
సోహంమనో విలీయంతే జీవన్ముక్తః సఉచ్యతే॥

14. ఊర్ధ్వధ్యానేనపశ్యంతి విజ్ఞానంమనఉచ్యతే
శూన్యంలయంచవిలయం జీవన్ముక్తఃసఉచ్యతే॥

15. అభ్యాసే రమతేనిత్యం మనోధ్యాన లయంగతం
బంధమోక్ష ద్వయంనాస్తి జీవన్ముక్తః సఉచ్యతే॥

బ్రహ్మజ్ఞాన రసాస్వాదీ జీవన్ముక్తః సఉచ్యతే॥

17. హృదిధ్యానే నపశ్యంతి ప్రకాశం క్రియ తేమనః
సోహం హంసేతి పశ్యంతి జీవన్ముక్తః సఉచ్యతే॥

18. శివశక్తి సమాత్మానం పిండబ్రహ్మాండ మేవచ
చిదాకాశం హృదంమోహం జీవన్ముక్తః సఉచ్యతే॥

19. జాగ్రత్స్వప్న సుషుప్తించ తురీయా వస్థితంసదా
సోహంమనో విలీయేత జీవన్ముక్తః సఉచ్యతే॥

20. సోహంస్థితం జ్ఞానమిదం సూత్రేషు మణితత్పరం
సోహంబ్రహ్మ నిరాకారం జీవన్ముక్తః సఉచ్యతే॥

21. మనఏవ మనుష్యాణాం భేదాభేదస్య కారణం
వికల్పనైవ సంకల్ప జీవన్ముక్తః సఉచ్యతే॥
22. మనఏవ విదుఃప్రాజ్ఞాః సిద్ధసిద్ధాంత ఏవచ
సదాధృడం తదామోక్షో జీవన్ముక్తః సఉచ్యతే॥
23. యోగాభ్యాసీ మనఃశ్రేష్ఠో అంతస్త్యాగీభహిర్జడః
అంతస్త్యాగీ బహితస్త్యాగీ జీవన్ముక్తః సఉచ్యతే॥

ఇతి శ్రీవేదాంతకేసరీ శ్రీమత్ దత్తాత్రేయవిరచితా
జీవన్ముక్తిగీతా సమాప్తా.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

నమోభగవతే దత్తాత్రేయాయ

# శ్రీ స్వరూప గీతా ప్రారంభః.

## ధ్యానశ్లోకం.

దత్తాత్రేయ మహాదేవం విశ్వవ్యాపిన మీశ్వరం
వేదాంతా చార్యమనిశం వందేహం పరమప్రభుం.

1. ఆబ్రహ్మ స్తంభ పర్యంతం సంపూర్ణే పరమాత్మని
భిన్నాభిన్నం నపశ్యామి తదాహం పంచమాశ్రమః.

2. నిరాలంబ మవాప్నోతి చిత్తే యత్ర లయంగతే
 నివర్తతేః క్రియాసర్వ స్తదాహంపంచ మాశ్రమః.
3. నిరాలంబం నిరాభాసం నిరాకారం నిరంజనం
 నిర్ద్వంద్వ ముచ్యతేమాయా తదాహం పంచమాశ్రమః.
4. మనస్థం మనమధ్యస్థం మనోమాయా వివర్జితం
 మనసామన ఆలోక్యా తదాహం పంచమాశ్రమః.
5. చిన్మయం వ్యాపితంసర్వం ఆకాశం జగదీశ్వరం

సర్వకల్ప స్వయంబోధా త్తదాహం పంచమాశ్రమః.

7. క్వచిత్ భోగీ క్వచిత్ త్యాగీ క్వచిన్న గ్నః పిశాచవత్
కామహా తత్వరూపేణ తదాహం పంచమాశ్రమః.

8. ఆశాపాశ వినిర్ముక్త ఆదిమధ్యాంత నిర్మలః
ఆనందే వర్తతేనిత్యం అకార స్తస్యలక్షణం.

9. వాసనా వర్జితాఏన వక్తవ్యంచ నిరామయం
వర్తమానేషు వర్తేత వకార స్తస్యలక్షణం.

10. ధూళిధూసర గాత్రాణి ధూతచిత్తో నిరామయః
ధారణా ధ్యాననిర్ముక్తో ధూకార స్తస్య లక్షణం.

11. తత్వచింతా ధృతాసన చింతాచేష్టా వివర్జితః
తమోహంకార నిర్ముక్త స్తకార తస్యలక్షణం.

12. దత్తాత్రేయా వధూతేన నిర్మితా నందరూపిణా
ఏపఠంతిచ శృణ్వంతి తేషాం నైవపునర్భవః.

ఇతిశ్రీ దత్తాత్రేయ విరచితాయాం మోక్షనిర్ణయస్వరూపగీతా
సమాప్తః.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

నమోభగవతే సీతారామాయ.

ఇతి శ్రీ వేదవ్యాస మహర్షి విరచిత అధ్యాత్మరామాయణో
త్తరకాండ పంచమసర్గ శ్రీఉమామహేశ్వర సంవాద
అధ్యాత్మసార అద్భుత శ్రీరామగీతాసారసంగ్రహ

చూర్ణిక.

1. ఓం నమోభగవతే రఘునాథాయ
2. త్రేతాయుగ రవికులోద్భవ రాఘవసింహా
3. కౌసల్యాః ప్రియసుత దాశరథీభావా

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



4. శ్రీ కౌశికకరుణావార గౌతమసతి వరప్రతాపా
5. జనకసుతాః ప్రియ దివ్యసుందరా
6. మునిశ్రేష్ఠ వసిష్ఠానుగ్రహా వైదికమార్గ స్వధర్మప్రవర్తకా
7. జయజయ రామాయణ కీర్తిముత్తమా
8. శ్రీసీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత అభిన్నావ్యక్త శక్తిస్వాతంత్రయ సహస్రాహార సింహాసనారూఢ శతకోటిభానుసదృశ సదానందానుభవ సర్వజ్ఞ సామ్రాజ్య షడ్గుణ సదా

10. శమదమాది షడ్గుణసంపన్న సౌమిత్రి సేవిత సదాచార్య సద్గురు ప్రభావా

11. అస్యశరీరో ద్భవ క్రమకారణాజ్ఞాన నిర్మూలరహిత సదోధిత నిర్జీవ నిరాధార నిర్వాణ నిర్గుణ నిగమసారః ప్రతిపాదకా

12. కర్మజ్ఞానసముచ్చయ ఖండన తత్వమస్యాది మహావాక్యార్థ నిరూపణా.

13. పాంచభౌతిక పంచీకరణ స్థూలసూక్ష్మ కారణ శరీరత్రయ విలక్షణ విదేహ పంచకోశాతీత నేతి వాక్యైః ప్రమాణనిరూపణా.

14. అయమాత్మాసావయ నిరవయశూన్యసదానందానుభవ సర్వజ్ఞ సాక్షిచైతన్య చిద్బింబ తేజోమయ చిత్ప్రకాశస్వరూపా

15. యోగీ హృత్పుండరీక శోభిత తేజోరూప భావిత ఏకాక్షరః ప్రణవచతుష్పాద అకార ఉకారో మకార అమాత్రాదిక అక్షరః పరనిర్వాణ ఆత్మానుభూతిః ప్రతిదాయకా

16. జీవన్ముక్త సదానందానుభవ ఏకీభూత యతిమానసాం తర్బహిర్ద్వి భేదరహిత ఆత్మారామా

17. అఖండ సచ్చిదానంద అమలాద్వితీయ అపరిచ్ఛిన్న అప్రమే

18. [illegible] కరుణాసాగం



కాలత్రయ సేవిత సీతానాయక దివ్యనామోచ్చారణ ప్రేరేపణ
భగవతీ పారాయణ పతిహృదే నివాసనారాయణ ప్రియభా
వన పరమాద్భుత ప్రబల శ్రుతిప్రతిపాదకముని శ్రేష్ట వ్యాసా
నుగ్రహ అధ్యాత్మరామాయణ సారామృత శివకామినీసంవాద
శ్రీరామగీతాః ప్రతాపా

శ్రీ సీతారాఘవ జయజయ శ్రీసీతారాఘవ
శ్రీ సీతారామ జయజయ శ్రీసీతారామ

నమస్తే నమస్తే నమస్తే నమః

మంగళాచరణం.

మంగళం రఘునాథాయ మహాధీర చిదాత్మనే
స్వప్రకాశ పరానంద సీతారామాయమంగళం.
మంగళం వసిష్టశిష్టాయ వైరాగ్య నిధిరూపిణే
సుధావిదేహ నాథాయ వేదవేద్యాయమంగళం.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

శ్రీరస్తు.

# లక్ష్మీనృసింహస్తోత్రము

(ఆంధ్రటీకాతాత్పర్యసహితము.)

---

చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1920.

## సంస్కృతగ్రంథములు.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| మాఘపురాణము, సాంధ్ర తాత్పర్యము ... | 2 | 0 |
| యజుర్వేదసంధ్యావందనము, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము, చిన్నసైజు, మంచికాగితములు. | 0 | 4 |
| పితృతర్పణము, చిన్నసైజు ... | 0 | 1 |
| వ్రతచూడామణి 800 వ్రతములు, మంచిప్రతి ... | 1 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము, అనేకవిషయములఁ జేర్చి యాంధ్ర మహాజనసంప్రదాయానురూపముగఁ బరిష్కరించి ముద్రించి యున్నాము. మంచిప్రతి ... | 2 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు ... | 0 | 4 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము ... | 2 | 6 |



శ్రీ ర సు.

శ్రీరస్తు

శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచిత

# లక్ష్మీనృసింహస్తోత్రము

ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

---

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1920

చార్యునింజూచి ఆయనభార్య యగునుభయభారతి నన్నుఁగూడ జయించినంగాని సంపూర్ణవిజయంబు గా దనెను. అంత వాదంబు కొంతకాలంబు చెల్లె. ఉభయభారతి మనంబున నిట్లు చింతించె. ఈయన అపరశంకరుఁడుగాని సామాన్యుఁడుగాఁడు. ఇతని నేవిద్య యందుఁగాని జయించుట సాధ్యముగాదు. చిఱుతప్రాయముననే సన్న్యసించినవాఁడుగావున కలాశాస్త్రంబునఁ గొన్ని విషయములఁ బ్రశ్నించెద. ఉత్తరము చెప్పనేని లోకులు నిందింప నవకాశంబు గలుగును. ఆ కొఱఁతయైన నీతనికిం గలుగుంగాక. అని ప్రశ్నింపనారంభించెను. శ్రీశంకరాచార్యులవారు సర్వ

విద్యాసని యయ్యెఁ గలా శాస్త్రమునం దన్నడిగిన ప్రశ్నముల
కుత్తరము చెప్పిన లోకు లీతఁడు బాల్యమున సన్న్యసించియు నీ
శాస్త్రమునఁ బరిచితుండునుం బోలె నిట్లు సమాధానము చెప్పుట
యరుదయ్యెడు నని తనసత్ప్రవర్తనమున సందియ మందుదు రని
తలంచి కొంతకాలము వ్యవధి కావలయు నని యడిగి వెంటనే
పయన మై యచ్చటచ్చట సంచరించుచుఁ బోవుచుండ నొకచో
ననేక భార్యలు మొఱలిడుచుండ మృతుఁడై పడియున్న రాజు కనఁ
బడెను. అచ్చటివారితో నేమియుం బలుకక కొంతదూరము
పోయి శిష్యులతోఁ దనకళేబరమును రహస్యస్థలమున నునిచి
కాపాడుచుండవలయు నని పలికి గుప్త ప్రకారముగ రాజుకళేబర
మును బ్రవేశించెను. ఆశ్చర్యకరముగ రాజు లేచి కూర్చుండుటం

జూచి పత్నులును. మంత్రులును, ప్రజలును సంతోషించిరి. యథా
పూర్వముగా రాజ్యమును బాలించుచు, సమస్తభోగముల ననుభ
వించుచుండెను. ఆదేశము రెండవస్వర్గమువలెఁ జూపట్టెను. పట్ట
పుదేవిమాత్రము కొంతసందియమంది తనలో నాలోచించిదూర
ము విసర్జించి మంత్రులం బిలిచి రహస్యముగఁ దనభావమును
దెలిపెను. మంత్రులును దల్లీ! మేమును బరీక్షింపఁగా నీరాజు
పూర్వపురాజువలెఁగాక సకలవిద్యాకుశలుఁడై యున్నాఁడనిరి.
అంత రాణి యీ పురుషుని నీశరీరముననే యుండునట్లు చేయుట
మంచిదని యోచించి మనరాష్ట్రమున నెందేని మృతకళేబరము

లుండిన వెంటనే కాల్పింపవలయునని గట్టియుత్తరువు చేసెను. రాజభటులు సర్వస్థలంబులు వెదకివెదకి శవంబులం గాల్చుచు శంకరునిశవం బున్న తావు చేరి దానినిఁ గాల్ప సమకట్టిరి. శిష్యులు వెంటనే పోయి "తత్త్వమసి తత్త్వమసి తత్త్వమసి రాజన్" అని చదువుఁ డని యాచార్యులవారు చెప్పియుండిరిగాన నాప్రకారమే చదువుచు రాజుగారి యింటిచుట్టును దిరిగిరి. ఆచార్యులవారు శయనించియుండి ఆశ్లోకములు చెవిసోఁకినంతనె ఆశరీరమును వదలి తనశరీరమునఁ బ్రవేశించెను. అప్పటి కాదేహము అగ్నిశిఖలచేఁ గొంతమాత్రము దహింపఁబడుచుండినందున "లక్ష్మీనృసింహమమదేహి కరావలంబమ్" అను మకుటము గలశ్లోకముల భగవంతుని స్తుతించెను. ఆదేహము యథాపూర్వముగాఁ

దేజరిల్లె. అట్టి మాహాత్మ్యము గలయీశ్లోకములు భక్తుల కమందానందమును గలిగించి సకలాపన్నాశకరము లై యుండుటవలన నిర్దుష్టముగ వానిని ముద్రించిన మేలని ముద్రించితిమి. వీనిం జదివి భక్తులందఱు సంతోషింతురుగాక.

---

శ్రియై నమః.

# శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము.

శ్లో. శ్రీమత్పయోనిధినికేతనచక్రపాణే
భోగీన్ద్రభోగమణిరాజితపుణ్యమూర్తే,
యోగీశశాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీనృసింహా మమ దేహి కరావలమ్బమ్.

టీ. శ్రీమత్=నికేతన - శ్రీమత్=రమ్యమైన, పయోనిధి = పాలకడలియొ, నికేతన=నెలవుగాఁ గలవాఁడా! చక్రపాణే - చక్ర = సుదర్శనమే, పాణే=హస్తమునఁ గలవాఁడా! భోగీన్ద్ర...మూర్తే - భోగీన్ద్ర = శేషునియొక్క, భోగ=పడగలయందలి, మణి=రత్నములచే, రాజిత = ప్రకాశింపఁజేయఁబడిన, పుణ్య=భక్తపావనమైన, మూర్తే=శరీరము గలవాఁడా! యోగీశ=(అష్టాంగయోగసిద్ధులైన) యోగులకుఁ బ్రభువైనవాఁడా! శాశ్వత=నాశనములేనివాఁడా! శరణ్య=దీనులకు దిక్కైనవాఁడా! భవాబ్ధిపోత=సంసారసముద్రమునకుఁ దెప్పయైనవాఁడా! హేలక్ష్మీనృసింహ=శ్రీమహాలక్ష్మితోఁగూడిన యోనృసింహస్వామీ! మమ=నాకు, కరావలమ్బమ్=చేయూఁతను, దేహి=ఇమ్మా.

[illegible]
శరీర మను పాన్పునందుఁ బవళించి యాతని తలలయందలి రత్నములచే నొడ
లెల్ల మెఱయ సొగసుమీఱ నున్నయో స్వామీ ! యోగులకు ధ్యానింపఁ
దగినవాఁడా ! ఓ నాశరహితుఁడా ! దీనులపాలిటి దిక్కైనయో స్వామీ !
సంసారసముద్రమును గడప నోడయగువాఁడా ! ఓ లక్ష్మీ నృసింహస్వామీ !
నాకుఁ జేయూత నిమ్ము.

బ్రహ్మేన్ద్ర రుద్ర మరు దర్క కిరీటకోటి
సంఘట్టితాఙ్ఘ్రికమలామలకాన్తికాన్త,
లక్ష్మీలసత్కుచసరోరుహరాజహంస
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 2

టీ. బ్రహ్మేన్ద్ర...కాన్త-బ్రహ్మ=బ్రహ్మయొక్కయు,ఇంద్ర=దేవేంద్రునియొక్కయు, రుద్ర=శివునియొక్కయు, మరుత్ = వాయువుయొక్కయు, అర్క=సూర్యునియొక్కయు, కిరీట=బొమిడికములయొక్కయు,కోటి=కొప్పెరలచేత, సంఘట్టిత=ఒరయబడిన, అఙ్ఘ్రికమల=అడుగుదామరలయొక్క, అమల=శుద్ధమైన, కాన్తి=ప్రకాశముచేత,కాన్త=మనోజ్ఞమైనవాఁడా! లక్ష్మీ...హంస-లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క, లసత్=ప్రకాశించుచున్న, కుచసరోరుహ=తామరమొగ్గలవంటిచనులకు, రాజహంస = రాజహంసమువంటివాఁడా! లక్ష్మీనృసింహ=లక్ష్మీనృసింహస్వామీ, మమ=నాకు, కరావలమ్బమ్=చేయూఁతను, దేహి=ఇమ్మా.

తా. బ్రహ్మ, ఇంద్రుఁడు, ఈశ్వరుఁడు, వాయువు, సూర్యుఁడు వీరి కిరీటముల యొత్తిడిగల పాదముల చక్కనికాంతిగలవాఁడా! లక్ష్మీదేవి యొక్క ప్రకాశించుచున్న చనుదామర మొగ్గలకు రాజహంసమైనవాఁడా! ఓలక్ష్మీనృసింహస్వామీ! నాకుఁ జేయూఁత నిమ్ము.

సంసారసాగరవిశాలకరాళకాల
నక్రగ్రహగ్రసననిగ్రహవిగ్రహస్య,
మగ్నస్య రాగలసదూర్మినిపీడితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 5 3

టీ. హేలక్ష్మీనృసింహ! సంసార... విగ్రహస్య-సంసార = సంసార

మైన, కామ=కామమను, నక్రగ్రహ=మొసలియొక్క, గ్రసన=మ్రింగు టయను, నిగ్రహ=దండనముగల, విగ్రహస్య=శరీరముగలవాఁడను, రాగ... తస్య-రాగ=తగులమను, లసత్=మెఱయుచున్న, ఊర్మి=అలలచేత, నిపీడితస్య=పీడింపఁబడుచున్న, మమ=నాకు, కరావలమ్బనమ్, దేహి..

తా. ఓలక్ష్మీనృసింహస్వామి! సంసార మనుసముద్రమందలి భయంకరమైన కామమను పెద్దమొసలిచేఁ జిక్కుపడినవాఁడనై, విషయచింతలను నలలచే వెనుకకు ముందునకు గుంజఁబడి బాధలనొందుచున్న నాకుఁబట్టగుము.

సంసారఘోరగహనే చరతో మురారే
మారోగ్రభీకరమృగప్రివరార్దితస్య,

ఆర్తస్య మత్సరనిదాఘనిపీడితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 4

టీ. మురారే=మురాసురుని బరిమార్చిన యోలక్ష్మీనృసింహా! సంసారఘోరగహనే-సంసార=సంసారమను, ఘోర=భయంకరమైన, గహనే=అడవియందు, చరతః=తిరుగుచున్నవాఁడును, మారో...తస్య-మార=మన్మథుఁడను, ఉగ్ర=క్రూరమైన, భీకర=భయదమైన, మృగప్రవర=ఘాతుకమృగముచేత, అర్దితస్య=గాసిపెట్టఁబడినవాఁడును, ఆర్తస్య=దీనుఁడును, మత్సర...తస్య-మత్సర=ఈర్ష్యయను, నిదాఘ=గ్రీష్మముచేత, నిపీడితస్య=శోషింపఁజేయఁబడిన, మమ=నాకు.

తా. ఓమురారీ! సంసారమనుకారడవియందుఁ బడి తిరుగుచున్న

ఘుఁ డను నీ క్రూరమృగమువాతఁబడి బాధనొందుచున్నవాఁడను. క్రోధమను గ్రీష్మముచేఁ బీల్చఁబడుచున్న నాకుఁ బ్రాపగుము.

సంసారకూప మతిఘోర మగాధమూలం
సంప్రాప్య దుఃఖశతసర్పసమాకులస్య,
దీనస్య దేవ కృపయా శరణాగతస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 5

టీ. దేవ=క్రీడించు నైజముగల, హేలక్ష్మీనృసింహ= ఓలక్ష్మీనృసింహ స్వామీ? అతిఘోరం=మిగులభయంకరమైనదియు, అగాధమూలం = చాల

లోఁతైనదియైనగు, సంసారకూపం = సంసారమనునూతిని, సంప్రాప్య = పొంది, దుఃఖశతసర్పసమాకులస్య - దుఃఖ=వ్యసనములయొక్క, శత=నూఱులను, సర్ప = పాములచేత, సమాకులస్య=కలఁతఁబెట్టఁబడినవాఁడను, దీనస్య = కృపణుఁడను, శరణాగతస్య=నీయండఁజేరిన, మమ = నాకు, కృపయా=దయతోడ, కరావలమ్బమ్, దేహి.

తా. ఓలక్ష్మీనృసింహా! మిగులభయంకరమై, చాలలోఁతుగలసంసారమనునూతిలోఁబడి దుఃఖము లనుపాములకుఁజిక్కి కలవరమునొందినకృపణుఁడగునన్ను కరుణించి చేయూఁత నిచ్చి లేవఁదీయుము.

సంసారభీకరకరీన్ద్రకరాభిఘాత
నిష్పీడ్యమానవపుషః సకలార్తితస్య,

ప్రాణప్రయాణభవభీతిసమాకులస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 6

టీ. లక్ష్మీనృసింహా! సంసార...వపుషః - సంసార = సంసారమను, భీకర = భయముగలిగించు, కరీంద్ర = మదపుటేనుఁగుయొక్క, కర= తుండముయొక్క, అభిఘాత = దెబ్బలచేత, నిష్పీడ్యమాన = మిగుల గాసిపెట్టఁబడిన, వపుషః = మేనుగలవాఁడును, సకలార్తిదస్య = అన్ని విధములచేత పీడింపఁబడినవాఁడును. ప్రాణ...కులస్య - ప్రాణ = ప్రాణముయొక్క, ప్రయాణ = ఉత్క్రమణమువలన, భవ=పుట్టిన, భీతి = భయముచేత, సమాకులస్య=చుట్టుకోఁబడిన, మమ=నాకు, కరావలమ్బం,దేహి.



తా. లక్ష్మీనృసింహస్వామీ! సంసారమనుభయంకరమైనమదపుటేనుఁగు

ఓ లక్ష్మీనృసింహస్వామీ! సంసారమను భయంకరసర్పముయొక్క కోఱలగు
తొండపు దెబ్బలచే నొచ్చిన మేనుగలవాఁడను. సమస్తబాధలచేఁ గృశించినవాఁడను, ప్రాణాపదవలన నైనభయముతోఁ గూడుకొనినవాఁడను నగు నాకుఁ జేయూఁత నొసంగుము.

సంసారసర్పఘనవక్త్రభయోగ్రతీవ్ర
దంష్ట్రాకరాళవిషదగ్ధవినష్టమూర్తేః,
నాగారివాహన సుధాబ్ధినివాస శౌరే
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 7

టీ. నాగారివాహన = సర్పవిరోధియగు గరుత్మంతుఁడే వాహనముగాఁ గలవాఁడా! సుధాబ్ధినివాస = పాలకడలియందు వసించువాఁడా!

శౌరే = శూరునిమనుమఁడా ! హేలక్ష్మీనృసింహా ! సంసార...మూర్తేః - సంసారమను, సర్ప = పాముయొక్క, విష = విషముచేత, దుష్ట = కులునవైనవియు, భీమ = భయంకరములైనవియు, ఉగ్ర = క్రూరము లైనవియు, తీవ్ర = వాఁడిగలవియునైన, దంష్ట్రా = కోఱలయొక్క, కరాళ = భీషణమగు, విష = విషముచేత, దగ్ధ = కాల్పఁబడినదిగాన, వినష్ట=రూపతియున్న, మూర్తేః = ఆకారముగల, మమ = నాకు, కరావలమ్బమ్, దేహి.

తా. ఓ గరుడవాహనుఁడా? పాలసముద్రమునఁ బవ్వళించుస్వామి! శూరుని మనుమఁడగు నోలక్ష్మీనరసింహస్వామీ ! సంసార మను త్రాఁచుఁ

బా[illegible] విస్తృతములై స్పష్టములై భయంకరములై క్రూరములై తీక్ష్ణము
లై నక్రోటులయందలి భీషణమయిన విషసంపర్కముచే నశించిన శరీరముగల
నాకుఁ జేయూఁత నొసంగుము.

సంసారజాలపతితస్య జగన్నివాస
సర్వేన్ద్రియార్థబడిశస్థఝషాత్మనశ్చ,
ప్రోత్తమ్భితప్రచురతాలుకమస్తకస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 8

టీ. హేజగన్నివాస=లోకములలో నంతర్యామియైయుండువాఁడా!
లక్ష్మీనృసింహ ! సంసా...తస్య - సంసార = సంసారమను, జాల=వలయం
దు, పతితస్య = పడినవాఁడును, సర్వే...నశ్చ-సర్వ = సమస్తములైన, ఇం
ద్రియార్థ=ప్రక్చందనాది విషయములను, బడిశ=చేఁపలవలయందలి గాల

మందు, స్థ=ఉన్న, ఝష=చేఁపయొక్క, ఆత్మనశ్చ = స్వరూపముగలవాఁ
డును, ప్రోత్తమ్భిత...కస్య-ప్రోత్తమ్భిత=ఎత్తఁబడినదియు, ప్రచుర=తెల
వఁబడిన, తాలుక=దవడలు, మస్తకస్య=శిరస్సునుగల, మమ=నాకు, కరా
వలమ్బం, దేహి.

తా. సర్వలోకాంతర్యామియగు నోలక్ష్మీ నృసింహస్వామీ! సంసా
రపుఁ జిక్కులమారి వలలోఁ దగులుకొని స్త్రీగంధాదివిషయములకు లోనై
వలలోనిచేఁపమాదిరి చిక్కుకొనుచున్న వాఁడును, ఎత్తఁబడినదియు తెలవఁ
బడిన చెలివెలు తలయు గల నాకుఁ జేయూఁత నిచ్చి దయతోఁ గాపా
డుము.

సంసారవృక్ష మఘబీజ మనన్తకర్మ
శాఖాయుతం కరణపత్ర మనఙ్గపుష్పమ్,
ఆరుహ్య దుఃఖజలధౌ పతితో దయాళో
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 9

టీ. దయాళో=దయగల, లక్ష్మీనృసింహ = లక్ష్మీనృసింహస్వామీ! అఘబీజమ్-అఘ=పాపమను, బీజమ్=విత్తుగలదియు, అనన్త...యుతమ్ - అనన్త=మితిలేని, కర్మ=చెడ్డపనులను, శాఖా = కొమ్మలతోడ, యుతమ్= కూడినదియు, కరణపత్రమ్-కరణ=ఇంద్రియములను, పత్రమ్ = ఆకులు గలదియు, అనఙ్గపుష్పమ్-అనఙ్గ = మన్మథుడను, పుష్పమ్ = పూవుగలది యునగు, సంసారవృక్షమ్ - సంసార=సంసారమను, వృక్షమ్ = మ్రానిని, ఆరుహ్య = ఎక్కి, దుఃఖజలధౌ-దుఃఖ=వ్యసనమను, జలధౌ=సముద్రమున,

పతితః = పడితిని, మమ = నాకు, కరావలమ్బన్ = చేతియూఁతను, దేహి=ఇమ్మా.

తా. స్వామీ! పాపములవలనఁ బుట్టి పెరిగి, పాపకర్మ, లనుకొమ్మలతోఁగూడి ఇంద్రియములను ఆకులు గలిగి మన్మథుఁడనుపూవు గలిగిన యీ నెడుసంసార మనుచెట్టెక్కి సంసారసముద్రములోఁ బడిననన్ను చేయూఁత నిచ్చి లేవనెత్తుము.

సంసారదావదహనాకులభీకరోగ్ర
జ్వాలావలీభి రభిదగ్ధతనూరుహస్య,
త్వత్పాదయుగ్మసరసీరుహమస్తకస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 10



టీ. హేలక్ష్మీనృసింహా! సంసార...భిః - సంసార=సంసారమను,

శ్రీ లక్ష్మీనృసింహ! సంసార...భిః = సంసార=సంసారమను,

దావదహన=కార్చిచ్చుచేత, ఆకుల=నలుమొగముల తలమూపుచున్న, భీకర=
భయంకరములైన, ఉగ్ర=క్రూరములైన, జ్వాలా=మంటలయొక్క, ఆవ
లీభిః=బాఱులచేత, అభి...హస్య- అభిదగ్ధ=కాల్పఁబడిన, తనూరుహస్య=
రోమములు గలవాఁడును, త్వత్పాద...కస్య- త్వత్పాదయుగ్మసరసీరుహ=
నీయడుగుఁ దామరలజంటయందుంచఁబడిన, మస్తకస్య=శిరస్సుగల, మమ=
నాకు, కరావలమ్బమ్, దేహి.

తా. ఓ లక్ష్మీ నృసింహస్వామీ?సంసారమనుకార్చిచ్చుయొక్క-అన్ని వైపులఁ జుట్టివచ్చుచున్న భయంకరములై క్రూరములైన మంటలచేమాడిపోయిన రోమములు గలవాఁడును నీపాదములను శిరమునఁ దాల్చి ధ్యానించుచున్న నాకుఁ జేయూఁత యొసఁగి దిక్కగుము.

సంసారసాగరనిమజ్జనముహ్యమానమ్
దీనం విలోకయ విభో కరుణానిధే మామ్,
ప్రహ్లాదఖేదపరిహారపరావతార
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 11

టీ. హేవిభో=ఓప్రభూ! కరుణానిధే=దయకు నెలవైనవాఁడా, ప్రహ్లాద...తార - ప్రహ్లాద=ప్రహ్లాదునియొక్క, ఖేద=దుఃఖముయొక్క, పరిహార=పోఁగొట్టినవాఁడా ! పరావతార - పర=శ్రేష్ఠములైన, అవతార= అవతారములుగలవాఁడా! హేలక్ష్మీనృసింహస్వామీ ! సంసార...మానమ్ = సంసారమను, సాగర=సముద్రమందు, నిమజ్జన = మునుఁగుటచే, ముహ్య

మానమ్=ఉక్కిరిబిక్కిరిమనుచున్నవాఁడును, దీనం=ఆపన్నుఁడనైన, మాం=నన్ను, విలోకయ=చూడుము. మమ=నాకు, కరావలమ్బం, దేహి.

తా. దయగల యోదోరా! ప్రహ్లాదునిఁగాచినయోయయ్యా! శ్రేష్ఠము లైన యవతారములు గలవాఁడా, ఓలక్ష్మీనృసింహా! సంసారసముద్రమునఁబడి యుక్కిరిబిక్కిరి యగుచున్నదిక్కులేని నన్నుఁ గాపాడుము. స్వామీ! నాకు జేయి యందిమ్ము.

సంసారయూథగజసంహతిసింహదంష్ట్రా
భీతస్య దుష్టమతిదైత్యభయంకరేణ,
ప్రాణప్రయాణభవభీతినివారణేన
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 12

టీ. హేలక్ష్మీనృసింహ! సంసార...భీతస్య- సంసార=సంసారమను, యూథ=మొత్తమైన,గజ=ఏనుగులయొక్క,సంహతి=కదుపులయొక్క, సింహ =హింస్రములైన,దంష్ట్రా=కోఱలవలన,భీతస్య=భయము జెందిన,మమ=నాకు దుష్ట...కరేణ- దుష్టమతి=క్రూరబుద్ధిగల, దైత్య=రాక్షసులకు,భయంకరేణ= భయమును గలిగించు,ప్రాణప్రియాణ...ణేన-ప్రాణ=ప్రాణములయొక్క, ప్రి యాణ=పోవునప్పుడు, భవ=పుట్టిన, భీతి = భయమును, నివారణేన = పో గొట్టు, నీదివ్యరూపముతోడ, మమ=నాకు, కరావలమ్బం, దేహి.

తా. ఓలక్ష్మీనృసింహా! సంసారమనుమందయేనుఁగుల వాఁడికోఱలకు భయపడి నీయండఁజేరిన నాకుపాపిరక్కసులకు భయావహమైనదియు,ప్రాణా

చేయిచ్చి లేవనెత్తుము.

సంసారయోగిసకలేప్సితనిత్యకర్మ
సంప్రాప్యదుఃఖసకలేన్ద్రియమృత్యునాశ,
సఙ్కల్ప సిన్ధుతనయాకుచకుఙ్కుమాఙ్క
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 13

టీ. సంసార...కల్ప -సంసార=సంసారముతోడ, యోగి=సంబంధముగల, సకల=సమస్తములైన, ఈప్సిత=కోరికలచే, నిత్య=ఎడబాటునొందని, కర్మ=కర్మలచేత, సంప్రాప్య=పొందఁదగిన, దుఃఖ=దుఃఖములను, సకల=సమస్తములైన, ఇంద్రియ=ఇంద్రియార్థములను, మృత్యు=మృత్యువును, నాశ=నశింపఁజేయు, సఙ్కల్ప=దివ్యసంకల్పముగలఁవాఁడా! సిన్ధు...మాఙ్క-సిన్ధు

=పాలసముద్రముయొక్క, తనయా=కూఁతురగులక్ష్మీ దేవియొక్క, కుచ=స్తనములయందలి, కుఙ్కుమ=కుంకుమపొడిచే, అఙ్క=గుఱుతుగాఁ గలవాఁడా! లక్ష్మీనృసింహా, మమ, కరావలమ్బం, దేహి.

తా. ఓలక్ష్మీ నృసింహస్వామీ! సంసారముతో సంబంధము గలసకలకామములవలనఁబుట్టె నిత్యములైన కర్మబంధములచేఁ బొందఁబడు దుఃఖములను సమస్తములైన ఇంద్రియార్థముల (స్రక్చందనాదుల)ను, మృత్యువును నశింపఁజేయు దివ్యసంకల్పముగలవాఁడా! లక్ష్మీదేవి స్తనములయందలి కుంకుమపొడిచే నలంకరింపఁబడినవాఁడా! ఓ లక్ష్మీనృసింహస్వామీ! నాకుఁ జేయూఁతనిమ్ము.

బద్ధ్వా కశై ర్యమభటా బహు భర్త్సయన్తి
కర్షన్తి యత్ర పథి పాశశతై ర్యదా మామ్,
ఏకాకినం పరవశం చకితం దయాళో
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 14

టీ. దయాళో=దయగల, హేలక్ష్మీనృసింహ ఏకాకినం=ఒంటరివాఁడును, పరవశం=ఒడలెఱుఁగనివాఁడును, చకితం=భీతుఁడైన, మాం=నన్ను, యమభటాః=యమునికింకరులు, యదా=ఎప్పుడు, బద్ధ్వా=కట్టి, కశైః=కొరడాలచేత (కొట్టుచు) బహు=మిగుల, భర్త్సయన్తి=బెదరింతురో, యత్ర=ఏ, పథి=త్రోవయందు, కర్షన్తి=ఈడ్చెదరో, (అప్పుడు,అక్కడ)మమ,కరావలమ్బం, దేహి.

తా. దయామయుఁడ వగు నోలక్ష్మీనృసింహస్వామీ ! ఎప్పుడు నన్ను యమకింకరులు దిక్కుమాలినవానిఁగాఁజూచి, పరవశుఁడనై భయముఁజెంది యుండగాఁ నెచ్చటఁ బట్టియీడ్తురో అచ్చోట నాసమయమునఁ బొడసూపి నాకుఁ జేయూఁత నిమ్ము.

అన్ధస్య మే హృతవివేకమహాధనస్య
చోరైర్మహాబలిభి రిన్ద్రియనామధేయైః,
మోహాన్ధకారకుహరే వినిపాతితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 15

హే లక్ష్మీనృసింహ=ఓలక్ష్మీనృసింహస్వామీ! అనస్య=రాగాదులచే గ్రుడ్డివాఁడను గనుకనే, బలిభిః=బలవంతులైన,ఇన్ద్రియనామధేయైః=ఇంద్రియములను పేరుగల, చోరైః=దొంగలచేత, హృత...ధనస్య-హృత=దొంగిలింపఁబడిన,వివేక=మంచిచెడ్డలయొక్క యెఱుక యను,మహా=గొప్పదగు,ధనస్య=ద్రవ్యముగలవాఁడను,మోహా...కుహరే-మోహ=అజ్ఞానమును, అన్ధకార=చీఁకటియొక్క, కుహరే=కోనయందు, వినిపాతితస్య = పడఁద్రోయఁబడిన, మమ=నాకు, కరావలమ్బం=చేయూఁతను, దేహి=ఇమ్మా.

తా. ఓలక్ష్మీనృసింహా! బలవంతులైన యింద్రియములను దొంగలు రాగాదులచే గ్రుడ్డివాఁడనైనందున నావివేక మనుకలిమినంతయుఁ దోఁచుకొని,నన్ను అజ్ఞానపుఁగోనలోఁబడ సెట్టిరి. నాకుఁ జేయిచ్చి నన్నుఁగాపాడుము.

లక్ష్మీపతే కమలనాభ సురేశ విష్ణో
యజ్ఞేశ యజ్ఞ మధుసూదన విశ్వరూప, ౧౨

బ్రహ్మణ్య కేశవ జనార్దనవాసుదేవ
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 16

టీ. హే లక్ష్మీపతే=ఓలక్ష్మీ నాథా! కమలనాభ=బొడ్డునఁ దామరగల వాఁడా! సురేశ=దేవతలలో మిన్నయగువాఁడా! విష్ణో=సర్వవ్యాపకుఁడైన వాఁడా! యజ్ఞేశ=యజ్ఞములయందు ఆరాధింపఁ దగినవాఁడా! యజ్ఞ=యజ్ఞ రూపుఁడా! మధుసూదన=మధు వనురాక్షసుని జంపినవాఁడా! విశ్వరూప= సర్వప్రపంచరూపము గలవాఁడా! బ్రహ్మణ్య=బ్రాహ్మణులకు హితుఁడైన వాఁడా! కేశవ=బ్రహ్మ రుద్రుల యంశలను దాల్చినవాఁడా! (త్రిమూర్తి స్వరూపీ) జనార్దన=దుష్టరాక్షసులను బీడించువాఁడా! వాసుదేవ=వసుదే

నృసింహ, లక్ష్మీనృసింహ=ఓ లక్ష్మీనృసింహస్వామీ! మమ=నాకు, కరావ
లమ్బం=చేయూఁతను. దేహి= ఇమ్మా.

తా. ఓలక్ష్మీపతే! బొడ్డున తామరగలయోస్వామీ! ఓదేవదేవుఁడా! ఓసర్వవ్యాపకుఁడా! ఓయజ్ఞపురుషుఁడా! ఓయజ్ఞరూపుఁడా! ఓమధు దైత్యమథనా! ఓసర్వప్రపంచ రూపుఁడా! ఓబ్రాహ్మణప్రియుఁడా! ఓజనార్దనా! ఓవాసుదేవా! ఓలక్ష్మీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

ప్రహ్లాదనారదపరాశరపుణ్డరీక
వ్యాసామ్బరీషశుకశౌనకహృన్నివాస
భక్తానురక్తపరిపాలనపారిజాత
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 17

టీ. ప్రహ్లాద...వాస - ప్రహ్లాద=ప్రహ్లాదునియొక్కయు, నారద = నారదునియొక్కయు, పరాశర=పరాశరునియొక్కయు, పుండరీక=పుండరీ

కునియొక్కయు, వ్యాస=వ్యాసమహర్షి యొక్కయు, అమ్బరీష=అంబరీషుని యొక్కయు, శుక=శుకమహర్షి యొక్కయు, శౌనక=శౌనకమహర్షి యొక్కయు,హృత్=హృదయములందు, నివాస=ఉండువాఁడా!భక్తా...జాత-భక్తాసురక్త=ప్రీతిగలసద్భక్తులయొక్క, పరిపాలన=కాపాడుటయందు, పారిజాత=కల్పవృక్షమువంటివాఁడా! లక్ష్మీనృసింహ,మమ, కరావలమ్బం,దేహి.

తా. ప్రహ్లాదుఁడు మొదలగు పరమభాగవతోత్తముల హృదయసీమల యందు ఎడతెగక యుండువాఁడా! అంతరంగభక్తులను గాపాడు కల్పవృక్షమా! ఓలక్ష్మీనృసింహా! నన్ను చేయిఁబట్టి లేవఁదీయుము.

ఏకేన చక్రముపరేణ కరేణ శఙ్ఖ
మన్యేన సిన్ధుతనయా మవలమ్బ్య తిష్ఠన్,

వామేతరేణ వరదాభయహస్తముద్రాం
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 18

టీ. హేలక్ష్మీనృసింహ, ఏకేన=ఒక్కటగు, కరేణ=చేతితోడ, చక్రం=సుదర్శనచక్రమును, అపరేణ=రెండవదానితో, శంఖం = పాంచజన్యశంఖమును, అన్యేన=మతియొకచేతితో, సిన్ధుతనయాం=శ్రీమహాలక్ష్మిని, వామేతరేణ=మతియొకకుడిచేతితో, వరదా...ముద్రాం=వరద=ఇష్టములనిచ్చు, అభయహస్త=భయములను బాపుహస్తముయొక్క, ముద్రాం=గుఱుతును, అవలమ్బ్య=తాల్చి, తిష్ఠ=ఉండి, మమ, కరావలమ్బం, దేహి.

తా. ఓలక్ష్మీనృసింహా! ఒకచేతితో చక్రమును, మతియొకచేత శంఖమును, వేఱొకయెడమచేత లక్ష్మిని, ఇంకొకకుడిచేత అభయప్రదమైన వరదానముద్రను దాల్చిన దివ్యరూపముతో దర్శనమిచ్చి నన్నుద్ధరించుము.

ఆద్యన్తశూన్య మజ మవ్యయ మప్రమేయ
మాదిత్యరుద్రనిగమాదినుతప్రభావమ్,
త్వాఽమ్బోధిజాస్యమధులోలుపమత్తభృఙ్గమ్
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 19

టీ. హేలక్ష్మీనృసింహ = ఓలక్ష్మీనృసింహస్వామీ! ఆద్యన్తశూన్యమ్ = మొదలుతుదలేనివాఁడును, అజమ్ = పుట్టుకలేనివాఁడును, అవ్యయమ్ = నాశముణేనివాఁడును, అప్రమేయం = కొలఁదివెట్టరానివాఁడును, ఆదిత్య... ప్రభావమ్ - ఆదిత్య = సూర్యుఁడు, రుద్ర = ఈశ్వరుఁడు, నిగమ = వేదములు, ఆది = మొదలగువానిచేత, నుత = పొగడఁబడిన, ప్రభావమ్ = సామర్థ్యము గలవాఁ

డును, అమ్భోధి...భృఙ్గమ్ - అమ్భోధిజా = సముద్రముకూఁతు రగులక్ష్మి యొక్క, ఆస్య=మోము (దమ్మి) యందలి, మధు=తేనెయందు, లోలుప = ఆసగొని, మత్త=మదించిన,భృఙ్గం=తుమ్మెదయునగు,త్వా=నిన్ను, (భజామి= సేవించెదను), మమ, కరావలమ్బం, దేహి.

తా. ఓలక్ష్మీనృసింహా ! తుదమొదలు లేనివాఁడును, పుట్టుక లేనివాఁడును, నాశము లేనివాఁడును, పరిమాణముచేయ శక్యము కానివాఁడవును, సూర్యుఁడు ఈశ్వరుఁడు సర్వవేదములు మొదలగువారిచేఁ గొనియాడఁబడిన సామర్థ్యముగలవాఁడవును, లక్ష్మీదేవియొక్క మోముదమ్మియందలి మకరందమును గ్రోలు మత్తభ్రమర మైననిన్ను సేవించెదను. నాకుఁ దిక్కగుము.

వారాహ రామ నరసింహ రమాదికాన్తా
క్రీడావిలోల విధిశూలిసురప్రవన్ద్య,

హంసాత్మకం పరమహంసవిహారలీలమ్
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 20

టీ. వారాహ=వరాహరూపము దాల్చినవాఁడా! రామ=బలరామ పరశురామ రఘురామావతారములు గలవాఁడా! నరసింహ=నరసింహరూపముగలవాఁడా! రమాదికాన్తా క్రీడావిలోల-రమా=లక్ష్మియే, ఆది = మొదలగు, కాన్త=ప్రియురాండ్రతోడి, క్రీడా = విహారమందు, విలోల = తవిలియున్నవాఁడా! విధి...వన్ద్య - విధి=బ్రహ్మచేత, శూలి = శివునిచేతను, సుర = దేవతలచేతను, ప్రవన్ద్య = మిగుల నమస్కరింపఁదగినవాఁడా! హేలక్ష్మీనృసింహ = ఓలక్ష్మీనృసింహస్వామీ! హంసాత్మకమ్ =

పరమహంసరూపుఁడవును, పరమహంసవిహారలీలమ్ - పరమహంస = పరమహంస(యతు)లయందు, విహార = విహరించుటయే, లీలం = వేడుకగాఁగల (నిను దలఁచుచున్న), మమ=నాకు, కరావలమ్బం, దేహి.

తా. వరాహాద్యవతారములను దాల్చినవాఁడా! లక్ష్మి మొదలగును త్తమ కాంతలతోఁ గ్రీడింపఁగోరువాఁడా! బ్రహ్మేంద్రాదులచే నమస్కరింపఁ దగినవాఁడా! పరమహంస రూపుఁడవును, పరమహంస యోగులయొక్క చిత్తములయందు మెలఁగు నిన్నుధ్యానించుచున్న నాకుఁ జేయినిచ్చి లేవఁ దీయుము.

మాతా నృసింహ శ్చ పితా నృసింహః
భ్రాతా నృసింహశ్చ సఖా నృసింహః,
విద్యా నృసింహో ద్రవిణం నృసింహః
స్వామీ నృసింహ స్సకలం నృసింహః.

టీ. మమ = నాకు, మాతా = తల్లి, నృసింహః = లక్ష్మీనృసింహ స్వామియే, పితాచ = తండ్రియు, నృసింహః, భ్రాతా = తోడఁబుట్టిన వాఁడు, నృసింహః, సఖా = మిత్రుఁడు, నృసింహః, విద్యా = చదువు, నృసింహః, ద్రవిణం = ధనము, నృసింహః, స్వామీ = రక్షకుఁడు, నృసింహః, సకలం = నాజీవితమందలి సర్వము, నృసింహః = శ్రీలక్ష్మీనృసింహాస్వామియే.

ప్రహ్లాదమానససరోజవిహారభృఙ్గ
గఙ్గాతరఙ్గధవళాఙ్గ రమాస్థితాఙ్గ,
శృఙ్గారసఙ్గరకిరీటలసద్వరాఙ్గ
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలమ్బమ్. 22

టీ. ప్రహ్లాద... భృఙ్గ-ప్రహ్లాద = ప్రహ్లాదునియొక్క, మానస=

చిత్తమను, సరోజ = తామరకు, భృఙ్గ = తుమ్మెదయైనవాఁడా ! గఙ్గా .. తాఙ్గ-గంగా = గంగానదియొక్క, తరఙ్గ = అలలవలె, ధవళ = తెల్లనైన, అఙ్గ=(ఇది నృసింహావతారమున కన్వయించును) శరీరముగలవాఁడా! రమా స్థితాఙ్గ-రమా = లక్ష్మీదేవిచేత, స్థిత = నిలువఁబడిన, అఙ్గ = శరీరముగల వాఁడా! శృఙ్గార... రాఙ్గ-శృఙ్గార=చక్కఁదనముచేత, సంగర=ఒప్పిదమైన, కిరీట=మకుటముచేత, లసత్ = వెలుఁగుచున్న, వరాంగ= శిరస్సుగల వాఁడా! లక్ష్మీనృసింహ, మమ, కరావలమ్బం, దేహి.

తా! ప్రహ్లాదుని మనఃకమలమందు విహరించు తుమ్మెదయైనవాఁడా! గంగనీటివలె తెల్లనైనదొడలు గలవాఁడా! సుందరమైన బొమిడికముచే నందమైనయొడలగలవాఁడా! ఓలక్ష్మీనృసింహా! నాకుఁ జేయూఁత నిమ్ము.

శ్రీశఙ్కరాచార్యరచితం సతతం మనుష్య

స్తోత్రం పఠేదిహ తు సర్వగుణప్రసన్నమ్,

# శ్రీలక్ష్మీనృసింహస్తోత్రము.

సద్యోవిముక్తకలుషో మునివర్యగణ్యో
లక్ష్మీపతేః పదముపైతి స నిర్మలాత్మా. 23

టీ. యః = ఏ, మనుష్యః = జనుఁడు, సర్వ...ప్రసన్నమ్-సర్వ= అన్నియగు, గుణ = గుణములచే, ప్రసన్నం = పావనమైన, శ్రీశఙ్కరార్య రచితమ్=బ్రహ్మసంపదగల శ్రీశంకరాచార్యులచేఁ జేయఁబడిన, స్తోత్రం = స్తోత్రమును, సతతమ్=ఎల్లప్పుడును, ఇహ = ఈమానవజన్మమున, పఠేత్ = పారాయణముచేయునో, సః=వాఁడు, సద్యః = అప్పుడే, విముక్తకలుషః- విముక్త=విడువఁబడిన, కలుషః=పాపములుగలవాఁడై, మునివర్యగణ్యః= మునివర్య=యోగీశ్వరులచేత, గణ్యః=కొనియాఁడదగినవాఁడై, నిర్మలాత్మా= పరిశుద్ధమైన స్వరూపముగలవాఁడై, లక్ష్మీపతేః=శ్రీమహావిష్ణువుయొక్క,

పదం=స్థానమును, ఉపైతి=పొందుచున్నాఁడు.

తా. ఏమానవుఁడు, శంకరాచార్యులు రచించిన యీయుత్తమస్తోత్రమును ఎల్లప్పుడు పారాయణము చేయునో వాఁడీజన్మమునన్, సమస్తపాపములను విడిచి, యోగిపుంగవులచే మెప్పు బడసినవాఁడై, పవిత్రస్వరూపము గలవాఁడై శాశ్వతమై పునరావృత్తిలేని విష్ణుసాయుజ్యమును పొందును.

యన్మాయయార్జితవపుః ప్రచురప్రవాహ
మగ్నార్థమర్త్యనివహేషు కరావలమ్బమ్,
లక్ష్మీనృసింహచరణాబ్జమధువ్రతేన
స్తోత్రం కృతం శుభకరం భువి శఙ్కరేణ. 13     24

టీ. యత్=ఏస్తోత్రము, భువి=భూమియందు, మాయయా=అజ్ఞానముచేత, అర్జిత=సంపాదింపఁబడిన, వపుః=శరీరము (జన్మ)ల యొక్క ప్రచుర=అధికమైన, ప్రవాహ=ప్రవాహమున మునిఁగినవారు గనుకనే, అర్థ=

## శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము.

పీడితులయిన, మర్త్య=మనుష్యులయొక్క, నివహేషు=సమూహములయందు, కరావలమ్బనమ్=చేయూఁతవంటిదో, తత్=అట్టి, శుభకరం=ముక్తిసంపదను గలుగఁజేయు, స్తోత్రం=స్తోత్రము, లక్ష్మీ...వ్రతేన-లక్ష్మీనృసింహ=లక్ష్మీనృసింహస్వామియొక్క, చరణాబ్జ=అడుగుఁదామరలయందు, మధువ్రతేన=తుమ్మెదయగు, శఙ్కరేణ=శ్రీశంకరాచార్యునిచేత, కృతం=చేయఁబడెను.

తా. ఏస్తోత్రము అజ్ఞానమూలము లైనకర్మబంధములవలనఁ గలిగిన జన్మపరంపరలయందుఁ బడి గాసి నొందినమనుష్యులసమూహములకు పట్టుగొమ్మయో, అట్టి మంగళకరమయిన స్తోత్రము లక్ష్మీనృసింహస్వామిపాదములయందు కింకరుఁ డగు శ్రీశంకరునిచేతఁ జేయఁబడినది.

శ్రీమన్నృసింహ విభవే గరుడధ్వజాయ
తాపత్రయోపశమనాయ భవౌషధాయ,

పీడితులయిన, మర్త్య=మనుష్యులయొక్క, నివహేషు=సమూహములయందు,
సా...ఫలమ్ప్రదమ్=చేయునట్టిసంటిదో, తత్=అట్టి, శుభకరం=ముక్తిసంపదను
ష్యార్థము చేయు, స్తోత్రం=స్తోత్రము, లక్ష్మీ...వ్రతేన-లక్ష్మీనృసింహ=లక్ష్మీ
ప్రులి మొదలగువియొక్క, చరణాబ్జ=అడుగుదామరలయందు, మధువ్రతేన
హైన వాయ్వగ్ని జలాది. రేణ=శ్రీశంకరాచార్యునిచేత, కృతం=చేయబడెను.
...జ్ఞానమూలము లైనకర్మబంధములవలన గలిగిన
శ్రీలక్ష్మీనృసింహాస్తోత్రాదినమనుష్యులసమూహములకు పట్టు
... లక్ష్మీనృసింహస్వామిపాద

---

---

‘వావిళ్ల’ ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 8 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 2 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసయిజు | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసయిజు, శుద్ధప్రతి | ... | 0 | 6 |
| రుద్రము, పురుషసూక్తము ఇత్యాదులు, చిన్నసయిజు | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము | ... | 0 | 4 |
| సంధ్యావందనభాష్యము, చక్కని ప్రతి | ... | 0 | 8 |
| అపరోక్షానుభూతి, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| హంసమాణికస్తోత్రము, సటీక | ... | 0 | 4 |

